# రాష్ట్రగానము

క్రొత్తపద్యముల
నాలుగవకూర్పు

తుమ్మల సీతారామమూర్తి చౌదరి

# పీఠిక

కవిత్వమున కానందము పరమప్రయోజనము. ఇది పర జాతు లెఱుఁగని దివ్యవిషయము. సర్వకవిత్వమునుండి సర్వ పాఠకునకు కలుగు నానందమందు భిన్నత్వము లేదనిలేదు. పాఠ కునికిశక్తి, ఆ కవనమునందలి శక్తి, ఈ యానందమునందు భిన్నత్వములు సంపాదించును. కవి పండితుఁడు. కవనము విద్వ త్కవిత. ఈ యానందము వేఱు. కవి రసజ్ఞుఁడు. పాండిత్య మెఱుఁగఁడు. కవనము ప్రతిభాద్యోతకము. పాండిత్యపు లోతులు తెలియనిది. ఈ యానందము ఇంకొక విలక్షణమైనది. పాఠకుఁడు కొన్ని విషయములయం దభిమానియై యుండెనేని తదభిమానవిషయ ప్రతిబింబము కాని కవనము వానికి గిట్టదు. భిన్నవస్త్వాశ్రియములైన భిన్నరచనలు భిన్నమైన యానంద మునే సమకూర్చును. ఇది యానందజిజ్ఞాస.

ఆంధ్రుడు తన మాతృదేశమునందలి యభిమానము కవితాపద్ధతిని కరఁగఁబోసెనేని అది ఆంధ్రునకే యానందదాయి. ఆ కవియొక్క అభిమానము ఒక విలక్షణత్వము కలిగి యుండు నేని అది తాదృశులకే యానందము సమకూర్చును. కవి నన్నయభట్టువలె స్వస్థానవేషభాషాభిమతుఁడైనచో తాదృ శుఁడు గాని వానికి నది యేమి యానందము సమకూర్చును ?

తెలుఁగుబాస మిక్కిలి తియ్యని దని పరదేశీయుల కంద ఱకుఁ దెలియును. తెలుఁగువారికే తెలియదు. అసలు పర భాషా నిష్ణాతులకు, నిష్ణాతులు కాకపోయినను తద్భ్రాంతి గల వారికి, తెలుఁగుమెత్తన తెలియదు. తెలుఁగు బాసలోని జివ తెలియదు. భాషాస్వభావమే తెలియనివానికి ఒక బాసకన్న

మఱియొక బాస శక్తిమంతమట్లు తోఁచును. అన్యదేశ్యములు లేని భాష యుండదు. పారిభాషికపదములలో మఱేవో అన్య భాషా పదములు చేర్చినందువలన ఏభాషకును లోపములేదు. ఒక భాషయొక్క స్వత్వము అన్యభాషా పదములు చేర్చు కొనుటలో లేదు. దాని నుడికారములో నుండును. ఆ నుడి కారము చెడనంతసేపు ఆ భాష కాదనుటకు వీలులేదు. ఒక భాషకు శక్తి తక్కువ యనఁగా, ఆభాషను మాటాడువారిలో, అందు గ్రంథములు వ్రాయువారిలో శక్తి లేదని యర్థము. ఒక మహాకవి పుట్టి తన మాతృభాష కొదుగని భావము లేకుండ చేయఁగలఁడు. తిక్కన్న, కేతన్న మొదలైనవారు తెలుఁగు భాషలో 'ఇది చెప్పవచ్చును. ఇదిచెప్పరాదు' అనకుండచేసిరి. బద్దెనీతి, విజ్ఞానేశ్వరము మొదలైన గ్రంథములు తెలుఁగు బాస శాస్త్రీయగ్రంథముల కెంత యనువైనదో రుజువు చేయఁ గలవు.

ఈ కవి స్వస్థానవేషభాషలయందు పరమాభిమాని. ఈయన కింగ్లీషు గిట్టదు. తెలుఁగుబాసయే కావలయును. పర దేశీయుల వేషము పనికిరాదు. ఆంధ్రు డాంధ్రునివలె కనిపించ వలయును. పూర్వాంధ్రుల వేషము మాఱినచో వాఁ డాంధ్రుఁ డుగా కనిపించఁడు. ఆంధ్రుఁడు ఉత్తరముకూడ తెలుఁగులో వ్రాయవలయును. "మఱి యింకొక పెద్దరోగమే కద్దు వచింతు నాంగ్లము మొగంబు నెఱుంగని శ్రోతముందు దుర్బుద్ధులు కూయుచుందు) పలుపోకల నెంగిలిపీసు కూతలన్" ఈ కవిలో స్వభాషాభిమానము పరాకాష్ఠ పొందినది. ఇట్లే తెలుఁగువాని

వేసమును కూర్చికూడ ఎన్నోచోట్ల సాభిమానముగా వ్రాయఁబడినది. వేషభాషలయం దనాంధ్రమైనది తిరస్కరింపఁబడినది. వెక్కిరించఁ బడినది. అసహ్యించుకొనఁ బడినది. ఓహో! ఆంధ్రులు ! ఈ గ్రంథము చదివి మీా వేమనుకొందురయ్యా ! కవికి విశాలబుద్ధి లే దనుకొందురు కాఁబోలు. మీాలో కొందఱేమను కొందురో కవికి తెలియును. "వేస మెటున్న నేమి పరవిద్యలకుఁ" మొదలైన పద్యము చూడుఁడు. తనవలె స్వస్థాన వేషభాషాభిమతము కలవాఁడు నేఁటి యాంధ్రదేశములో అల్పసంఖ్యాకుఁ డని కవి యెఱుఁగును. అందుకనియే 'నైజవేషభాషాచరితమ్ములందు తన జాతిమతమ్ములయందు పేర్మిగల్గి చరియించుగుణాఢ్యుఁ డొకండు చాలఁడే' అన్నాఁడు. అనాంధ్రునియందు ఆంధ్రవిరోధియందు ఈకవి ప్రచండకోపి. వారిలో నొకఁడు యంత్రబ్రహ్మ. ఒకఁడు దేవయ్య. ఒకఁడు భైరవుఁడు. ఒకఁడు కశ్చన. ఆంధ్రులలో కులతత్త్వములే ఆయనకు గిట్టవు. నియోగులు, వైదికులు, కమ్మవారు, కాఁపులు—ఇంక లక్ష భేదములు. ఈ భేదములు, వీనిని పురస్కరించుకొనిన దురభిమానము ఈకవియూహలో "వెధవ" గుణము. ఈమాటను సాహసించి వాడినకవి ఎంత అచ్ఛశీలుఁడు, ఎంత అమృతహృదయుఁడు, ఎంతటి యాదర్శబుద్ధి! ఈ కవికి కులభేదబుద్ధి లేదు. ఆంధ్రదేశములోనున్న సర్వమేధావులును—అతఁడు బ్రాహ్మణుఁడో, కమ్మయో, కాఁపో, రెడ్డో అందఱును ఆదరణీయులు. తాపీ ధర్మారావుగారును, పట్టాభి సీతారామయ్యగారును రాజకీయముగా, సాంఘికముగా సామ్యము

లేనివా రయ్యును ఆయన కాదరణీయులు. ఎవరైనను సరే వాఁడు మేధావి, వాఁ డాంధ్రుఁడు. ఆయనకు కావలసిన దది.

ఆంధ్రుఁడు ప్రాచీనుఁడు, పశ్చిమాంధ్రుఁడు, ఉత్తరాంధ్రుఁడు—ఈ భేద మాయనకు లేదు. అన లుండరాదు. ఈ భేదములు పెట్టుకొన్నచో ఈకవి తాను మనస్సులో పొందెడు వ్యథ చెప్పరాకుండ నున్నది. "నాదా చిత్తము నిర్విధిం గలతురే న్యాయంబు వర్జింతురే" ఈ కవి ఆవేశములో ఈ బహ్వాంధ్రులలో తా నొక్క వ్యక్తి యనియే మఱచిపోయెను. తా నాంధ్రమాత్ర స్థానీయుఁడు. సర్వాంధ్ర హృదయాంతర్వర్తి యైన మూర్తాంధ్రాభిమానము. ఈ కవిస్వరూప మది ఈయన ప్రాణములో హృదయములో, మనస్సులో, శరీరములో నాంధ్రుఁడు. ఈ యాంధ్రత్వమును భిన్నవర్ణములు చెఱుపలేవు. భిన్నవృత్తులు చెఱుపలేవు. భిన్నప్రకృతులు చెఱుపలేవు. ఆహా! ఓయి ఆంధ్రుఁడా! నీ వీ కవివంటివాఁడవగుదువేని పతితమైన యాంధ్రజాతి ఒక్కనిమేషములో తొలినాఁటి గొప్పతనమును పొందదా?

ఈకవి యాంధ్రజాతినిగూర్చి చేసిన పరిశోధన అపారముగా నున్నది. అనేక స్థలములందు వివరణములు లేకుండ సర్వజనులకు నర్థముకాదు. అఱవలు పెండిలిలో తురగమెక్కి యేగుట, సరిగుంజలతో పందిరి విరచించుట: ఈ యాచారములు పరిశోధించి చూచినవి. ఒకరీతిగా నేమిటి? ఎన్నోవిషయములు త్రవ్వి యెత్తి చూపించఁ బడినవి. ఆంధ్రతేజము నేఁటికిని చావలేదనుటకు నీలువిగ్రహానిర్మూలనమే సాక్షి. కవి దానినికూడ చెప్పినాఁడు.

ఈ గ్రంథమంతయు నొక యెత్తు. పశ్చిమాంధ్రులను గూర్చి వ్రాసినది యొక యెత్తు. ఆదోనిసభ కవిహృదయము నెంత వేధించినదో! "రాయలసీమ" అని ప్రత్యేకింపఁబడుటకు కవి పొందినదుఃఖము ఒక ప్రత్యేకఘట్టమైనది. రాయలు కర్ణాటకుఁడే యందము. అతని సేనానాయకులు సాయప నేని వారు, పెమ్మసానివారు, రావెళ్ళవారు, మంత్రితిమ్మరుసు,— వీరందఱెవరు? వీరులేని రాయ లెవరు? ఓ రాయలసీమాంధ్రు లారా! ఒక సత్కవిమనస్సు ఇంత నొప్పించినందులకు మీవాద మింతటితో వదలుకొనవచ్చును. మన పూర్వులకున్న కవితాభి మానము మీ కున్నచో ఇది లెక్కలోనిది కాదు. ఒడ్డెగజపతి పెద్దన్న వ్రాసిన పద్యానికి దండు త్రిప్పుకొని పోయినాఁడఁట. మీకొఱ కీ కవి యొక్క కావ్యమే వ్రాసెను.

అసలు పుస్తకమునకు పీఠిక వ్రాయుట నా యుద్దేశము కాదు. పాఠకుఁడు వాని సంస్కారము కొలఁది గ్రంథమును చదువుకొనును. అల్ప సంస్కృయావంతునకు పీఠిక వ్రాసి యెక్కువ సంస్కారము కుదుర్పలేము. ఐనను కస్మింశ్చిద్దేశ మందు ఫలవంతము కావచ్చును. ఈ కవి యాంధ్రచరిత్రయు నాంధ్రోద్యమమును చదివి యనుసరించి ఈ గ్రంథమును వ్రాసెను. వానిగుర్తు లీ చిన్నికావ్యమున సర్వశః కనిపించును. అది యట్లుంచి ఈయన పాండిత్యమును, కవితాశక్తిని గూర్చి వక్కాణింపఁ బోయినచో నదియు వ్యర్థప్రయత్నము. ఏల యనఁగా నట్లు చేయుట సూర్యుని దివ్వెపెట్టి చూపించినట్లు. తెలుఁగుకోస్తాలో ఈయన పే రందఱు నెఱుఁగుదురు. ఈయన

రచన లెల్లరు చదివిరి. వీరి ఆత్మకథ మనభాష కలంకార ప్రాయముగా నున్నదని రామలింగారెడ్డిగారి యంతవారు చెప్పిరి. నెల్లూరి పండితపరిషత్తులో "తిక్కన్నబహుమానము" ఈ యేడు పొందినది వీరు. ఈబహుమానము పొందుట తేలిక పని కాదు. కవితాశక్తితోపా టనేకవిషయము లున్నం గాని యిది లభించదు. ఆధునికయుగలక్షణ చిహ్నితమైన కావ్యరచనయే దీనికి పరీక్ష. ఇట్టికవి కవితాశక్తి తక్కువది కాదు. కాని ఒక్క విషయము చెప్పవలయును. మెఱుపు మెఱసిపోవును. కనులు మిఱుమిట్లు గొనవచ్చును. దాని మెఱుపు లిప్తమాత్రము. ఒక వెన్నెలతీగ మెఱుపు సౌదామని వలె లిప్తమాత్రాంధ్య హేతువు కాకపోవచ్చును. కాని చలించనిదై నేత్రాభిరామమై ఆలోచించినకొలఁది చూచినకొలఁది హృదయంగమమై యుండును. పండితుఁడుగాని కవికి, పండితుఁడైన కవికి భేద మిది. అసంస్కృతమైన ప్రతిభావిశేషము చేత వాఁడు కనులు మిఱుమిట్లు గొలుపును. ఇతఁడు సంస్కృతమైన ప్రతిభను దీప్తినబోదెల కొదిగించి ఆలోచించినకొలఁది చూచినకొలఁది రమ్యత్వమాపాదించును. ఈ కవి యీతరగతి కవి. ఈయనను చదివినకొలఁది తెలిసిచదివినచో వడిదుడుకులు లేని ఆహ్లాదపు నిలుకడకలిగించును. ఈయన సహజముగా పెద్దన్నకవితారీతి నచ్చినవాఁడు. సరిగా నట్లేవ్రాయగలవాఁడు. చూడుఁడు. "ఇఁక శాస్త్రవు లాంధ్రులు తీరవాసులా ? శ్రమలకునోర్చి యేగురునిసన్నిధి నేర్చితిరీ వివేకముల్" ఇది ఉక్తిపరిపాకము. "చుక్కలు చుంయిచుంయి మనుచుంబడ నేర్చెడి తల్లిఁగంటిరే" "మిన్నులుపడ్డ దేశములు" పెద్దన్నగారి యీ

మాటలేగాక కొన్నిచోట్లసరిగా పెద్దన్నగా రూఢిపడినట్లే యుండును. ఇదిగాక శ్రీనాథుడు, పోతన్న: వీ రీకవికి విద్యాగురువులు. "కై వల్య కల్యాణ ఘంటాపథము" "మందార మకరంద మాధుర్యము" "అపరాధంబులు లేవు మానవలన"— వీనిని యథాస్థితికముగ ప్రయోగించుకొన్నాఁడు. పూర్వకావ్యములలోని కొన్ని చక్కని మాటలు ఔచిత్యమెఱిఁగి ప్రయోగించు నేర్పు ఈ కవికి చక్కగా కలదు. "సూర్యాణము" వాడిన కవి కావ్యములు చక్కగా చదివినవాఁడు కదా! ప్రాసనుడియందు చక్కని మమకారము, తీపియు కలవాఁడుకదా. ఇట్టివే "ఒజ్జబంతులు" "నలసారములు". "సోదర్యుఁడు" "ప్రథితి" "దేశభక్తిపదవీసదవీయసి" ఇట్టిమాట లీకవియొక్క పాండిత్యద్యోతకములు. అనుతాపమునందలి ప్రథమపద్యము ఈయనగారి సుఖమైన సమాసపుగూర్పున కుదాహరణము. ఈయన లోకోక్తులు ఎత్తిచూపించుటకు బహుళములు. తెలుఁగునుడికారమునందు చక్కని పట్టుదలగల కవి. అమ్ము విఱచి నిల్చుట, నామము రూపము లేకుండుట, నెత్తురుపిండుట, తంపివెట్టుట, మొదలైనవి దీని కుదాహరణములు. లోకోక్తులు, నుడికారములు, పూర్వకవీశ్వరవాక్ప్రయోగదక్షతయుఁగాక కవి సహజముగా ఉక్తివైచిత్ర్యము కలవాఁడు. దేశ్యములైన కొన్నివాడుకమాటలు వాడుటలో కొంత కవితాశక్తి యుండును. "నెత్తురుపిండి కయ్యాలకు నీరముచేసి జగమ్ము పెంచుకాఁ పెత్తువడంగఁ జూచి" ఈ కూర్పు, ఇచ్చటి కయ్య లన్న శబ్దము తచ్ఛక్తిపోషకములు. తెలుఁగుపద్యము వ్రాయుట

ఒక ప్రత్యేకశిల్పము. ఈ శిల్పములోని మెలఁకువలు ఈకవి గారి కెన్నో తెలియును. ప్రశస్తిలోని రెండవపద్యము అచ్చముగా శ్రీనాథునిపోఁత. "ఆహ్వానము" లోని మూఁడవది యైన సీసపద్యముయొక్క చక్కని ప్రౌఢి చూడుఁడు. సీస పద్యముచేఁత మరల వేఱు. "ప్రశస్తి"లోని ప్రథమ తృతీయములును, కైవారములోని మూఁడవపద్యమును చూచినచో దీనియందలి యొకపద్ధతి తెలియును. గీతపద్యమునందు చెప్పఁదలచుకొన్న యొకరమ్య విషయమును పై నాల్గుపాదములతో సమర్థించుట దీని వైలక్షణ్యము. సముద్రమున కేతాము త్తినట్లు సత్కవిత్వమునకు విమర్శ.

విశ్వనాథ సత్యనారాయణ

౧౨-౮-౩౯

# నివేదనము

ఐదు సంవత్సరాలనాటి మాట. మిత్రులతో మెరీనా బీచిలో షికార్లు కొడుతూవుండగా ఆంధ్రాభిమాని యగు ఆంధ్రపుత్రు డొకడు చదువుతూవున్న రాష్ట్రగానం నాకంట బడింది. రాష్ట్రోద్యమం ఆంధ్రుల్లో రేకెత్తుచున్న ఆదినాల్లో ఇట్టి ఉత్తమ కావ్యం వెలువడడం ఆంధ్రుల పుణ్యమని భావించాం. అందలి ప్రతిపద్యమునూ పఠించి పరవశులమై పోయాం. 'ఓహో! కవీ! నీవు ధన్యుడవోయ్' అని అభినందించాం.

ఐదు సంవత్సరాలు గడచి పోయాయి. అణగి మణగి వున్న రాష్ట్రాందోళన సర్ విజయాగారి నాయకత్వాన మళ్లీ తలయెత్తింది. నా హృదయవీణ ఆనాటి రాష్ట్రగానాన్ని ఆలాపించి ఉడుకు రక్తాన్ని ఉద్ధూత లూచింది. ఆంధ్రుల ఔన్నత్యం కోసం ఎంతో ఆరాటపడి తన ఆవేదనను కావ్యరూపాన వెలువరించి జాతికీ భాషకూ దేశానికీ ఎంతో మేలు చేసిన కవినీ కావ్యాన్నీ గౌరవించి ఆంధ్ర కవుల్లో జాతీయభావాన్ని విజృంభింప జేయాలనే వాంఛ బలీయమైంది.

మిత్రులు ఇనగంటి వెంకటప్పయ్య చౌదరి, ఆచంటి బుచ్చిరాయుడు చౌదరి, ఆచంటి నాగయ్య చౌదరి, కొడాలి చక్రపాణి చౌదరి, ఇనగంటి చౌదరి ప్రభృతుల చెంత నా వుద్దేశాన్ని బహిర్గతం చేశాను. వారి ఉద్యమానికి జవమూ, జీవమూ ప్రసాదించారు. మా ఆశయాన్ని కృతికర్తలూ కృతి భర్తలూ ఆదరించారు. ఆహ్వానసంఘం ఏర్పడింది. అందు కవి సన్మాన భాగానికి వేంకటప్పయ్యచౌదరిగారూ, కృతిసమర్పణ భాగానికి బుచ్చిరాయుడుచౌదరిగారూ అధ్యక్షు లయ్యారు.

గడువు చాలా తక్కువైనా మా విన్నపాన్ని కవిగారి భాషాసేవనూ పాటించి సుప్రసిద్ధ కవులూ, పండితులూ తమ అమూల్యములైన సన్మాన పద్యాలు దయచేశారు. ఇందుకు మా "అభినవ తిక్కన సన్మాన సంచిక"యే నిదర్శనం.

౧౨—౭—౬౨ వచ్చింది. అప్పికట్లలో ఆంధ్రకవితా వసంతోత్సవం అత్యంత వైభవంతో ఆరంభమైంది. అసంఖ్యాకులైన కవులతో, పండితులతో, రసలుబ్ధులగు ప్రజలతో ప్రజానాయకులతో జగజ్జేగీయమానంగా కృతి సమర్పణసభా, కవిసన్మానసభా జరిగిపోయాయి. ఈ సభలకు కవిరాజుగారూ, కుప్పుస్వామిచౌదరిగారూఅధ్యక్ష్యంవహించారు. సభలు ఆధునిక కవులకు మేలుకొల్పులు పాడి ఆదర్శములయినాయి. మాయీ విజయానికి సహాయం చేసిన ఉదారులందరికీ మేము కృతజ్ఞులం. ఇంకో మాట :

కృతిస్వీకార సందర్భంలో లోకాచారం పాటించి కృతిదాతను వేయార్లతో సన్మానింప బూనిన శ్రీ రాజాగారు

"కృత మెఱుక చాలు నన్మన్నతి కింతద కబ్బమిచ్చి మణిగొంట జగద్ధిత శీలుండొదవ నయాచితమ్ముగా నిడుదు నా సృజించిన కవితన్."

అనే కవిగారి నియమాన్ని మావల్ల తెలుసుకొని సీతారామమూర్తిగారి పవిత్రమైన ఆదర్శాన్ని మాసూచననూ మన్నించినందుకు వారికి మా ధన్యవాదాలు.

అప్పికట్ల
గుంటూరుజిల్లా

కుర్రా వేంకటసుబ్బారావు
౯—౧—౬౬

# విన్నపము

౧౯౩౭ అక్టోబరు మాసమున విజయవాటికయం దఖండ వైభవముతో నడచిన యాంధ్రమహాసభలోఁ దెల్గు వారు రాష్ట్ర సంపాదనముపట్ల వెలువరించిన యావేశము, ప్రచరించిన యుత్సాహము, ప్రకటించిన యుద్రేకము నా యీ కవిత యవతరించుటకుఁ గారణములు.

ఆ నాఁడు శ్రీ శ్రీ చల్లపల్లిమహీపాలుఁ డాహ్వాన సంఘము నధ్యక్షించి తత్సభా విజయమునకు ముఖ్య హేతువై సకలాంధ్ర ప్రశంసాభారవాహియై రాణించుటంజేసి యీ కావ్యము వారి కుడుగర మైనది.

ఈకృతికన్యకు నైదవయేఁడు వచ్చినది. ఈమె పుట్టువుతో సహస్రముఖముల విజృంభించిన యాంధ్రోద్యమము రాజకీయ ప్రతిష్టంభాదులచే నాఁటికి సన్నగిల్లినది. అట్టితటి మిత్రులు కుప్పా వేంకట సుబ్బారావుగారు నాకడకు వచ్చి "మాయూర మిమ్ము సత్కరించుటకును, మీ రాష్ట్రగాన కృతిసమర్పణ మహోత్సవము నిర్వహించుటకును సమకట్టితిమి. ఏతన్మూలమున మేము మీ భాషాసేవను గౌరవించినవార మగుటయ కాక రేకుముడుఁగుచున్న రాష్ట్రవాంఛ కొకవీసముపాటి వికాసము నొసంగినవారము నయ్యెదము. కావున మీరిందులకు నీకొనవలయు" నని నన్నుఁ గోరిరి. వీరు పూనిన కార్యములలో మొదటి దనావశ్యక మైనను రెండవది జాతీయాభ్యుదయమునకు దోహద మొనర్చునది యగుట నేను వినీతినై "వల్లె" యంటిని.

అంత వీరును శ్రీ యినగంటి వేంకటప్పయ్య చౌదరి గారును నుదారులగు నాంధ్రమహాజనుల తోడ్పాటుతో నీకార్య

క్రమమునుదాత్త మార్గమున సాగించి నాకును నాకావ్యమునకును పెద్దఱికము చేకూర్చిరి. ఇది నా మనుగడలో మఱవరాని యపూర్వ సంఘటనము. ఆనందమయ ఘట్టము. అప్పికట్ల పుర వాసుల యీ యప్పు నీఁగఁ జాలను.

బహుకార్య నిమగ్నులు మహారాజులు నయ్యు స్వాయముగా విచ్చేసి నా కృతిని స్వీకరించి తమ సారస్వత ప్రేమమును రాష్ట్రాభిమానమును జాటిన దేవరకోట సంస్థానాధీశులు శ్రీమంతు రాజా యేర్లగడ్డ శివరామప్రసాద్ బహద్దరువారి సౌజన్యము విస్మరింప రానిది.

నా వేఁడికోలు నాదరించి శ్రమ యనక యీ గ్రంథము నకు విపులమైన పీఠిక వ్రాసి వన్నె తెచ్చిన కవిసమ్రాట్టులకు నా కేలుమోడ్పులు.

నా రాష్ట్రగానము నెడ నత్యంతాభిమానము చూపిన పాఠక మహాశయులకును దమ తమ రాష్ట్రగీతముల కుపఘ్నముగా నా యీ చిన్నిగానమును ముద్దుసేయు కవికుమారుల కును నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

రెండేండ్లనుండి ప్రతులు లేమింజేసి కొందఱీ కబ్బమును వ్రాసికొను చున్నారు. వ్రాసి యమ్ముకొను చున్నారు. అయి నను బెక్కుర కాశాభంగము తప్పుట లేదు. కాన యచ్చు వెచ్చ మెంత దుస్సహముగానున్నను బెక్కు విశేషములతో నీనాల్గవకూర్పు వెలయించితిని. ఆంధ్రసోదరులు యథాపూర్వము దీని మన్నింప వలతు. వినీతుఁడు

# అంకితము

దీక్షం బూనితి నాంధ్రరాష్ట్రమును సాధింతున్ దదీయక్రియా
రక్షన్ జేసెద నెట్టికష్టమయినన్ రానిమ్ము కానిమ్ము మా
తృక్షోణీయశ ముద్ధరింతు నని భక్తిన్ గంకణం బూను నీ
కక్షయ్యం బగు నేర్లగడ్డశివరామా! చల్లపల్లీశ్వరా!

ప్రాకటదీక్షఁ బూని పలుబాముల కోర్చి గడించె మున్నఁ బ
ర్లాకిమిడిప్రభుండు నిజరాష్ట్రము; నీవు త్రిలింగరాజ్య ల
క్ష్మీకమనీయవై భవిష్టమహోత్సవ మూలకారణ
శ్రీకృతకృత్యతం గని ప్రసిద్ధి వహింపఁగదయ్య! భూవరా!

మచ్చున్ దెచ్చెడి తుచ్ఛభోగములకై మానాభిమానంబులం
దిచ్చ ల్మాని ధనాఢ్యులౌ తెలుఁగు లిస్సీ! సర్వసంపత్తులన్
వెచ్చంపెట్టెడి వేళ దేశజననీ విక్లేశ విచ్ఛిత్తికై
నిచ్చల్ తోడ్పడు నిన్ను మెచ్చవలదా? నిస్తంద్రవాగ్ధోరణిన్

నీ సౌజన్యము నాంధ్రమండలయశో నిర్మాణకార్యైక దీ
క్షాసంపత్తి నెఱింగి పొంగినది నా స్వాంతమ్ము; వాణీవిపం
చీ సఖ్యంబును గన్న యీకవిత నిచ్చెన్ గాన్కగా నీకు నీ
వాసిన్ వన్నెయు దేశదేశములలో వాసించు నా సత్కృతిన్

( కృతిసమర్పణ సభనాఁటివి )

రాజా! నీ కవితాభిమానమున కాంధ్రక్షోణి సంతుష్టయై
జేజేల స్గురిపించెఁ గావ్యవిభుతాశ్రీ నందఁగా నెందఱో
మోజుం జూపిరిగాని సత్కవిసుధీమూర్ధన్యు లౌరా! యనం
గాఁ జేపట్టిరటయ్య నిండుసభలోఁ గబ్బంబు లబ్రంబుగన్

వెల్లుగ భోగభాగ్యములు పిండెడు దేవరకోటరాజ్యమున్
జల్లఁగ నేలు రాజకుల చంద్రుఁడ వయ్యును బేదవాని కి
ట్లల్లుఁడవైతి వౌర! హృదయంబువినా మఱిముద్దుముచ్చటల్
చెల్లఁగ నేమి కట్నములు సెప్పెద సాలువులేమి కప్పెదన్

తుమ్మ లేర్లగడ్డ లిమ్మాయి వీయమ్ము
లందుకొనుట చోద్యమా నరేంద్ర!
తుమ్మ లేర్లగడ్డతోఁ గాక ఊాతితో
అప్పతోడఁ జెలిమికొప్పు నౌరా!

రోసముచెంది డెందమున రోయకు మీ కవితాలతాంగి నీ
గీసిన గీతలో నిలువకే తిరుగున్ గనఁబడ్డవాని సా
వాసమునెల్లఁ జేయు బలవంత మొనర్చిన మాన దిట్టి యు
ల్లాసము లాఱునూఱయినఁ బోపటవెంద్రుక వెల్లఁబాఱినన్

కోటల్ దాఁటిన దాటుగాక యిది తెల్గుంగొమ్మలేఁదోఁటలోఁ
దేటల్ చల్లు నొయారిమల్లెపొదరై దీపించి భూభృత్సభా
వాటీ సత్కవిలోక పండితఘటావాచాపరిస్తుత్యమై
నీటుం గుల్కెడు కీర్తి నీ కొసఁగి వన్నెందెచ్చు నుర్వీశ్వరా!

# కృతిపతుల కృతజ్ఞత

మహాశయులారా !

నా జీవితములో ఇది యొక సుదినము. ఈమాటలు ఏదో సభల ఆచారము ప్రకారము చెప్పుచున్న మాటలుగాక హృదయపూర్వకముగ చెప్పుచున్నవి, యథార్థములు.

కవులు, పండితులు, దేశభక్తిపరాయణులు ఎందఱో యీ సభ నలంకరించి యున్నారు. ఇందఱ సమక్షమున ఇట్టి మహాసభాముఖమున, ఒకఉత్తమకావ్యమును కృతినందగలిగిన భాగ్యము నాకు నేడు లభించినది. నాకిట్టి మహావకాశము అపూర్వము. కాబట్టి నాకిది ఒక పర్వదినము.

తుమ్మలవారి "రాష్ట్రగానము" ఆంధ్రుల హృదయముల హత్తుకొనిన ఉత్తమకావ్యము. ఆంధ్రుల పెదవులపై లాస్యము చేయుచున్న పద్యావళి. ఏపద్యముచూచినను, ఏపుట త్రిప్పినను, ఆంధ్రాభిమానము, ఆంధ్రరాష్ట్రదీక్ష ప్రత్యక్షముగ కనబడును. కవిహృదయము వలెనే ఈ గ్రంథము ఆంధ్రత్వ పూరితము. అనేక ముఖముల వ్యాప్తిగాంచుచున్న ఆ పద్యములే దీనికి సాక్షి. పండితకవితల్లజులు విశ్వనాథ సత్యనారాయణగారు పీఠికలో వ్రాసిన మాటలే దీనికి తార్కాణము. ఇట్టి ఉత్తమ కావ్యముతో నాపేరు కలిసియుండుట మహాసుకృతము.

ఇంతేకాదు. ఇంకొక్క విశేషము; అది స్వవిషయము. ఆంధ్రజనాభివృద్ధి కోరుటలో నేనొకరికి తీసిపోవువాడను గాను. ఆంధ్రరాష్ట్ర సిద్ధికొఱకు, నేనును పరితపింతును. ఈ విషయములో శ్రీ తుమ్మల సీతారామమూర్తి గారికిని నాకును ఎంతో భావ సాదృశ్యమున్నది. నాకే కాదు; ఆంధ్రులలో అనేకులకు. అయిన

నేమి? వారికున్న యీ ప్రకటనశక్తి అందఱకు లేదు. ఏదో ఆందోళన మన హృదయములలో రగులుచుండునే గాని, మాట బయటికి వెళలదు. వెకలినను గాసట బీసటగానే ఉండును గాని హృదయముల నాకర్షించదు. కేవలము మనము మూగవారమే. నిజము.

ఏదో చెప్పదలచు కొనిన మూగవాడు చెప్పలేక కొట్టు కొనుచుండును. ఆ అభిప్రాయమును గ్రహించి ప్రకటించ గలిగిన వాడు ఒక్కడు దొరకినపుడు ఆ మూగ యెంత పరమానంద భరితుడగును? ఆతనితో ఐక్యమును ఏర్పఱచుకొనును గదా! అట్లే నేనును నాతోపాటు మీరును ఈ కవివతంసునితో ఏకత్వము నాపాదించుకొనుట.

ప్రజా భావమును ఆకళించి యీ కవి తన కావ్యములో ప్రకటించినాడు. ఇట్లు చేయుటయే సత్కవితాలక్షణ మందురు. సత్కావ్యము "సంక్షిప్త ప్రజాభావమై" ఉండవలెనట. ఆ భావమును సంక్షేపించుటతో ఈ కవి సంతోషించి ఊరకుండ లేదు. ఆ భావమునకు చక్కని పద లాలిత్యమును జతపఱచి మనోహరత్వమును కల్పించెను. చెప్పదలచిన మాట గట్టిగా చెప్పెను. కృతార్థత చెందెను.

కవిసత్తమా !

ఈ ఆంధ్రదేశము పుణ్య భూమి. ఎందఱో భాషా కోవిదులు, ఎందఱో దేశ భక్తులు, ఎందఱో రాష్ట్రదీక్షా కంకణులు ఈ దేశమున నున్నారు. ఎన్నో విధముల నాకంటె నెక్కువవారు కలరు. అయినను ఈ కృతికి నన్నే మీరు

ప్రత్యేకించుట. నా అదృష్టము. మీ అవ్యాజాభిమానము నాయందు కలదని మీరు చెప్పిన ఆ గుణములు, ఆ అభిమానము సంకల్పించినవే అని నే నెఱుగుదును. రాష్ట్రగానము నందు మీ కెంత ఆదరము కలదో, నాయందు మీ కంత అభిమాన మున్నది. కృతజ్ఞుడను.

మీ కవిత లత వంటిది. పూర్వ వాసనవల్లనో, ప్రస్తుత కృషివల్లనో లత పొడచూపును. లేదీవెలు చాచుకొనుచు వ్యాపించును. అల్లుకొని అంతయు తానే అగును. భూమిని కప్పి పరిమళముతో భూనభోంతరమును ముంచి యెత్తి ప్రపంచమును వాసయోగ్యముగ చేయును. అది సత్కవితా లతకు లక్షణము. దానిది స్వేచ్ఛావిహారము. దాని నాపుట కెవ్వరును చాలరు.

ఆ లత ప్రాకికొని పోవుటకు అక్కడక్కడ ఒక ఆలంబనము కావలసియుండును. ఒక కొమ్మయో, ఒక కొయ్యయో అది ప్రకృతికి అవసరము. ఆ కొమ్మకుగాని, కొయ్యకుగాని స్వతస్సిద్ధమగు యోగ్యత అక్కఱలేదు.

అట్టివారలే కృతిభర్తలని నా భావము. కవితా లత వ్యాపించుటకు వీరు కేవలము నిమిత్తమాత్రులు. వీరి వలన కవితా లతకు కొంత — కొంతయే సుమండీ — అనుకూలత యేర్పడవచ్చును. కాని ఆ లతవలన ఈ కొయ్యకు కలిగిన మేలు అపారము. అది ఎంత ప్రోడయినను ఈ లతవలన మనోహరమగును. మంచి గౌరవమునకు పాత్ర మగును.

సీతారామమూర్తిగారూ !

మీ హృదయము రాష్ట్రచింతతో పరితప్తమైనది. అక్కడ రేగిన తుపాను మీ కంఠమునుండి "రాష్ట్రగానము"గ వెలువడినది. దీనిలోని భావగౌరవమువలనను, మృదు మధుర శైలి వలనను ఈ గానము ప్రతి ఆంధ్రుని కంఠమునను ప్రతిధ్వనించుచున్నది. ఇట్టి రసవత్కావ్యమును నాకు కృతి నిచ్చుట మీ భావోదార్యమును ప్రకటించుచున్నది. ఆదర పూర్వకముగ మీ రిచ్చిన కృతిని నేను భక్తిపూర్వకముగ స్వీకరించి, ఆంధ్రభాషామతల్లికి వినయపూర్వకంగా సమర్పించు చున్నాను. అయాచితముగ లభ్యమయిన ఈ కావ్య పుష్ప ముతో ఆంధ్రమాత పాదపద్మముల నలంకరించి అప్రయత్న ముగ ఈ మహాభాగ్యము నందుచున్నాను. నా కిట్టి అవకాశ మును కలిగించిన మీకు నే నెంతయు కృతజ్ఞుడను.

# రాష్ట్రగానము

## జోహారు

తెనుఁగుతల్లీ నీకు జోహారు
దేశమాతా నీకు జేజేలు

నినుఁజూచి నినుఁబాడి నినుఁ గొల్చువేళ నా
కను లాణిముత్యాల గనులుగా నగునహో !

తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా నీకు జేజేలు

నీపాలు జుంటితేనియతేటలో గోస్త
నీ పక్వరసమో సుధాపూరమో యాట
నాపల్కు లీ తీయనకు నోఁచి విశ్వ వా
ణీ ప్రపంచ ప్రశంసాపూరితము లాయె

తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా నీకు జేజేలు

కుటిలశాత్రవకోటిగుండెలో నిదురించి
యిటుసేతు నటుగంగ యెల్లగా జగ మేలె
నట రాజకంధరా నైల్యమ్ము నడఁగించు
పటుకీర్తి పెంచె నీపట్టి యెంతటివాఁడో

తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా నీకు జేజేలు

ఎల్లోర కొండ నీ యల్లారు గీ మటే.
కొల్లూరి కోహినూరు కొప్పులోఁ బూవటే
కొల్లారు గనులు నీకోశం బటే పండ్లు
పుల్లనై పోవు నీ భోగమ్ము కన్నచో.

తెలుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా నీకు జేజేలు

గౌతమీ కృష్ణానదీ తుంగభద్రాది
పూతస్రవంతికా పుంజమ్ము నీముద్దుఁ
గూఁతులై నీచేను నీతోఁట పండింప
నీ తనూజులు పైఁడి పాఁతఱల్ కప్పిరే !

తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా నీకు జేజేలు

ఏపుణ్యలేశమ్ము నాపాలిదాయెనో
నాపూజ కేలోకనాథుండు పొంగెనో
నీపావనోదర శ్రీపరంపరలలో
నీ పదార్చకులలో నేను నొక్కఁడనైతి

తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా నీకు జేజేలు

## హెచ్చరిక

కలదోయి! తెలుఁగుజోదుల తుటారికటారి
చెలరేఁగి పగఱఁ జీల్చిన దినంబు
కలదోయి! తెలుఁగురాజులు గంగగట్టుపైఁ
దీండ్రించి పడగలెత్తిన దినంబు
కలదోయి! రేవురేవులఁ దెలుంగు సరంగు
మొనసి లంగర్లు దింపిన దినంబు
కలదోయి! తెలుఁగుపల్కుల వెలంది వెలంది
వెలుఁగు లెల్లెడలఁ బర్విన దినంబు

కలదు కలదోయి! తెల్గుపెగ్గడలు మన్ను
మిన్ను తాళంబువైచి పేర్గన్న దినము
నేఁటి నీపాటునెంచి కన్నీటి నిడకు
నిలుచునే కాల మొకలీలఁ దెలుఁగుబిడ్డ!

తెలుఁగుదాతల దానజలవేణిలో గిరుల్
తెప్పలై పరువులెత్తిన దినంబు
తెలుఁగువారలభోగములఁ గాంచి పాకశా
సనుఁడు గ్రుక్కిళ్ళు మ్రింగిన దినంబు
తెలుఁగుటోజ్జలపాదములచెంత జగమెల్ల
విజ్ఞానమధువు ద్రావినదినంబు
తెలుఁగుబిడ్డలు తిలాంజలి కులమ్ముల కిచ్చి
యన్నంబు నొకచాపఁ దిన్నదినము

కలదు కలదోయి! తెల్గుపోకడలు విశ్వ
మునకు మేల్బంతులై వెలింగినదినంబు
నేటి నీపాటునెంచి కన్నీటి నిడకు
నిలుచునే? కాల మొకలీలఁ దెలుఁగుబిడ్డ!

ఉడుగనిపౌరుషంబు విజయోత్సవకారణ మన్న సూత్రమున్
విడువక దేశభక్తిపదవీనదవీయసి యైన దీక్షమై
సడలిన మాతృగౌరవము సంపదల న్గడియించునంతకున్
మడమను ద్రిప్పఁబోకు జయమంగళముల్ నినుసంశ్రయించులన్

## కైవారము

నన్నపాచార్య తిక్కన్నాదికవికోటి
యే తల్లికురువుపై నెక్కియాడె
కృష్ణరాయాదిక్షితిపాలు రే తల్లి
జోలపాటలలో సుషుప్తి గనిరి
రావెళ్ళమల్లనప్రముఖవీరవరేణ్యు
లో తల్లి రే తల్లి యుదరసీమ
త్యాగరాజాదిభక్తసమాజ మే తల్లి
యందిచ్చు వెన్నల నారగించె

గౌతమాపత్య కృష్ణవేణీ తరంగ
పాళి యేతల్లి తూఁగుటుయ్యాల లయ్యె
దీక్షమైఁగొల్తు నయ్యాంధ్రదేశమాతృ
విమలచరణద్వయంబు హృద్వీధి నిల్పి

గిరిలోకరాజ మంబరచుంబిశిఖరంబు
వింధ్యంబు ఛత్రమై వెలుఁగుచుండఁ
జలధూర్మికాహ స్తముల మోచికొని తెచ్చి
కడలి రత్నచ్ఛటల్ కానుక వెట్ట
గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రలు
ముత్యాలసరములై మురువు సూపఁ
గవికుమారులు హృద్యగద్యపద్యమ్ముల
నిజవైభవంబు వర్ణించు చుండ

గుణములకోటారు లైన ముక్కోటిబిడ్డ
లడుగు దాఁటక యూడిగ మాచరింపఁ
జెన్నపురహేమపీఠికాసీన యగుచు
దేశముల నేలుఁ గాక మా తెలుఁగుతల్లి

బ్రహ్మదేశంబు నీ పంటపండిన చేను
మధ్యరాష్ట్రముల నీ మాట చెల్లు
అస్సాములోన నీ యందంబు రాణించు
బీహారునందు నీ పీఠమలరు
వంగభూమికి వన్నె వాసి గూర్తువు నీవు
బొంబాయి నీ విలాసంబునెలవు
మైసూరుసీమ నీ మంగళాకృతి వెల్గు
మధురలో నీ పల్కు మాఱుమ్రోఁగు

సింహళద్వీపమందు నీ చిన్నెలొప్పు
నాఫ్రికాఖండ మది నీ విహారభూమి
నందియంబేల వైష్ణవీశక్తి వీవు
తెలిసికొన్నాఁడ నీ పెంపు తెలుఁగుతల్లి !

పరవేషభాషాసపర్య తారకమాట
నాంధ్రత్వమే సగం బడఁగిపోయె
పరఖడ్గమునకు లోఁబడి జోహారులుపెట్ట
స్వాతంత్ర్యభావముల్ జారిపోయె
కులతత్త్వములు చుట్టుకొని యీర్ష్యలకు దింప
నైకమత్యము సర్వ మాఱిపోయె
అసమర్థతాపంకమందు బ్రుంగుటఁజేసి
మెట్టవేదాంతముల్ మీఱిపోయె

నలఁగిపోయిన యీనాఁటి తెలుఁగుబిడ్డ
కేమి సందేశమిత్తు తల్లీ! తమస్సు
విడుచుచున్నది యిప్పుడీప్సాడె రవంత
ఉద్ధరింపుము వీని సద్బుద్ధు లొసఁగి.

చతురంత ధారణీచక్రంబు శాసించు
వీరప్రతాపు లీ వేళ లేరు
పరవీర్యలుంటాక బాహా బల ప్రౌఢి
గల బాలచంద్రు లీ గడియ లేరు

ఖడ్గంబు నందిచ్చి కదనభూమికి నాథు
నడపు మాంచాల లీ నాఁడు లేరు
కండల న్గదలించు కైత లామెతలిచ్చు
తిక్కనయజ్వ లీ దినము లేరు
లేరు పండిత లోకావలేపజలద
మండలీ చండవాయువుల్ మల్లినాథు
లూఁచపోయిన సంతాన మేచునట్లు
దీవన ల్గురియింపవే తెలుఁగుతల్లి !

## ప్రశస్తి

తన కత్తినీడలోఁ బెనిచె ధైర్యముసెప్పి
దక్కనులోన హైందవమతంబు
తన బుద్ధిసాగరత్వము తేటతెల్లగా
వేదభాష్యమ్ములు వెల్లడించె
తన తంత్రశక్తికిఁ దార్కాణగాఁ బాదు
షాలకే కుచ్చుటోపీలుపెట్టె
తన కళాలిప్స కద్దమువోలె రాణింపఁ
గల్పించె భువనైకశిల్పవీథి

తనరసజ్ఞత కది నిదర్శనము గాఁగ
మోసెఁ గవిరాజుపల్లకీముందుకొమ్ము
కొమ్ముదిరిగినవారలే కొలువుసేయ
దిక్కులొత్తిన మొనగాఁడు తెలుఁగువాఁడు

కాకుళమందు ధాన్యకటకంబున హంపిని దంజపూరిలో
నేకశిలాపురిన్ మెఱయు క్షేమవిచిత్రము పాటలీపుర
శ్రీకబరీభరమ్మున విచిత్రసుమస్తబకంబు నిర్జరీ
లోకమనోహరం బయి తెలుంగులకెక్కుము నాట్యమాఁడగన్

ఒకనాఁడు శాక్యమానికి జయధ్వను లిచ్చి
కరుణసుధావృష్టి కురిసినాఁడు
ఒకనాఁడు శంకరార్యున కండయైనిల్చి
జ్ఞానచంద్రిక వెదచల్లినాఁడు
ఒకనాఁడు రామానుజోపదేశముమెచ్చి
భక్తిప్రపత్తులు పంచినాఁడు
ఒకనాఁడు మోహానోక్తికి నంజలిఘటించి
కులగర్వములు వంగఁగొట్టినాఁడు

నేఁడు గాంధిమహర్షి వాణికి శిరంబు
వంచి సల్పెడి గాఢసేవావ్రతంబు
ఉత్తమోత్తమధర్మ మొందున్న దాని
కొలువు మరగెడివాఁడు మా తెలుఁగువాఁడు

జలధు లేడింటి కవ్వలిమిట్టపై నల్లు
కొనె రాఘవేంద్రుని గుణలతాళి
కర్ణాటనరపతిగ్రామక రక్షకజాతి
కింటివేల్పయ్యె విశ్వేశ్వరుండు
అతివేలరాజకీయజ్ఞానదాతయై
చింతామణి జగత్ప్రసిద్ధి వడసె
సింధురాష్ట్రప్రజాసేవకోత్తంసమై
రాణించెఁ గోటమరాజుకులుఁడు

నాగపురధర్మపరిషత్తునకు వినూత్న
రామణీయక మిడె మాచిరాణ్ణియోగి
తారకావర్తి కుముదబాంధవుని యట్లు
వెలుఁగు నెచ్చోట నున్న మా తెలుఁగువాఁడు

పాలిచ్చి జోలలఁ బాడుతల్లులు పుణ్య
వేదికల్ గలవు కృష్ణాదినదులు
క్షేత్రముల్ గల నిహాముత్రభోగమ్ముల
కాధారములు తీర్థములాదికములు.
కలవు బూదికి జీవనముల నిచ్చునోషధుల్
కృపసేయుగిరులు తూరుపుకనుమలు
రారాజులకిరీటరంగమ్ము లెక్కి ని
క్కిన వజ్రములఁ గన్న గనులు గలవు

కలదు నౌకాప్రయాణసౌకర్యమునకుఁ
జాలినట్టిది గంభీరసాగరంబు
ఎల్లసంపదలకుఁ బుట్టినిల్లనంగఁ
దేజరిల్లిననాఁడు మా తెలుఁగునాఁడు

అకలంకశౌర్యమూర్తికి శివాజికి రాజ్య
తంత్రంబు నాంధ్రుఁడే దాన మిచ్చె
వీప్వాలయేల్బడి పెంచె మంత్రిత్వంబు
మోసి పింగళివారిమోరోపంతు
చైతన్యునకు భక్తిలోతు లన్నియు మప్పి
మహిమ గూర్చెను బిల్వమంగళుండు
కర్ణాటకవితావికాసనిర్మాతలై
ప్రథితి కెక్కిరి పూజ్యపాదముఖులు

కూర్చె హిందీకవిత్వంబు క్రొత్తక్రొత్త
పాకములతోడ భట్టపద్మాకరుండు
పుక్కిటిపురాణములు గావు పూర్వచరిత
తఱచి కన్గొనుఁ డాంధ్రసోదర్యులార !

ఆంధ్రరాజ్య స్థాపనాచార్యుఁడై తెల్గు
వేలుపై నాఁ డాంధ్రవిష్ణువిభుఁడు
రణకళానిధి సుశర్మను జంపి మగధోర్వి
శాసించె శ్రీముఖచక్రవర్తి

ఘోత్తరాపథుల నెల్ల నదలించె పోలుండు
శాలివాహనశకస్థాపకుండు
నిజ జయ స్తంభముల్ నిఖిలదిక్కులఁ బాఁతె
గౌతమీపుత్రుండు శాతకర్ణి

శాత్రవుల గెల్చి మాళవధాత్రికెల్ల
నాథుఁడయ్యెను * వాసిష్ఠినందనుండు
ప్రాఁతవడినట్టి యాంధ్రభూపతుల కథలు
చదువుఁ డొకసారి కండలు కదలియాడ

భారతావని కోజ్జబంతులు పల్కు నా
పస్తంబ ఋషి నీదు పాలుగుడిచె
ఖండఖండాంతరఖ్యాతుఁ డౌ సిద్ధుండు
నాగార్జునుండు నీ నందనుండు
కైవల్యకల్యాణ ఘంటాపథము గన్న
యోగివేమన్న నీ యొడిని గులికె
బొందితో నపవర్గ మందినభక్తుండు
గోపన్న నీ ముద్దుఁగొమరుఁ గుఱ్ఱ

పారతంత్ర్యపిశాచంబు పైకొనంగ
నయనములు విప్పలేక యున్నావుగాని
సుతులు నీవార లతిలోకమతులుగారె
అఖిలసద్గుణసముపేత! ఆంధ్రమాత!

---

* పులమావి

రాష్ట్ర గానము

తనవిద్యచే లోకమున కొజ్జ యైనట్టి
యన్నమభట్టు నా యన్న యనుచుఁ
దనదానధారచే దెనుఁగుగడ్డను ముంచు
భాస్కరమంత్రి నా బంధు వనుచుఁ
దనప్రజ్ఞచే మన్ను మిను గుప్పిటం బట్టు
ప్రగడ తిమ్మరుసు నా భ్రాత యనుచుఁ
దనగీతిచే జగమ్మునకు జీవము పోయు
త్యాగయ్య నాదు సోదరుఁ డటంచు

విశ్వరంగమ్ముపై త్రొమ్ము విఱిచి నిలిచి
లీలమైఁ బల్కుహక్కు నాకే లభించె
ధన్యతాభాజనంబుగదా మదీయ
జీవితం బని సమ్మదశ్రీ భజింతు

పసిఁడిముద్దలు దోసపండ్లుగా నర్థుల
జడ్డ మాన్పిన వాసిరెడ్డివిభుఁడు
పలుకు పల్కునఁ గావ్యకళలు పింపిసలాడ
సుకృతిఁ గూర్చిన నన్నెచోడనృపుఁడు
నిఖిలప్రజకు నోపనిషదపీయూషంబు
కురియు వీరబ్రహ్మ గురువరుండు
అభినవ భోజరాజాఖ్యాకుఁ డానంద
గజపతిక్ష్మాభృదాకల్పకుండు

భగవ దవతారుఁ డాసూరి పావనాభి
జనుఁడు రామానుజాచార్యుఁ డనఘుఁ డస్మ
దీయుఁ డనఁ గంటి నిట్టి జాతీయగరిమ
నాకుఁ గా కెవ్వనికిదక్కు లోకమందు

లాలిత్య లక్ష్మీవిలాసరంగమ్ము ని
 ల్పితి వజంతా చిత్రలేఖనమ్ము
నవరించితివి శైవభువనంబు "నెల్లోరా"
 కొండను మైనంపు టుండఁజేసి
విఠ్ఠలప్రభుని కోవెలకంబములచేతఁ
 బలికింపఁ గంటి సప్తస్వరాలు
ఒలికించితౌర ! తిర్మలనాథు నగరులో
 వెలలేని సభ్యతా విలసనములు

భగవ దన్వేషణార్థమై పాటువడిన
యుత్తమతపస్వివై కళాయోగివైన
నీకు ఋణపడె రసలుబ్ధ లోకమెల్ల
నాంధ్రశిల్పీ ! చిరంజీవి వయ్య నీవు

కలము ఖడ్గము పట్టఁగలనేర్పు పడసిన
 రెడ్డినాగమ్మ నీ బిడ్డ యటవె
జగమగంటిమి నాంధ్రజగతిఁ బాలించిన
 గరత రుద్రమ్మ నీ కన్నె యటవె

గండికోటను మల్కుదంష్ట్రపై దూఁకిన
  * గోవిందమాంబ నీ కూఁతు రటవె
మానంబుకై నిజప్రాణంబు బలియిచ్చు
  మల్లాంబ నీదు కొమార్తె యఁటవె

వీఁగివచ్చిన హృదయేశు వెక్కిరించి
పోరి కనుపు చానమ్మ నీ పుత్రి యటవె
ఎంత తేజస్వినివి తల్లి! యెఱుక లేక
నీ మహత్త్వంబు తెలియంగ లేము గాని

## అనుతాపము

ఏతాదృగ్విభవాభిరామ మగు నా యీదేశ మాశాతటీ
మాతంగప్రమదావిశాలకటసీమానిర్గళద్వేణికా
ప్రీతేందిందిరగీతకీర్తినిధియై పెంపొంది నేఁ డక్కటా
రీతిన్ బ్రాక్తనవర్ణనీయసుషమారేఖారమన్ గోల్పడెన్

పాటలీపుత్రమ్ము కోటకొమ్మలమీఁదఁ
  దెలుఁగుజెండాలు నర్తించునాఁడు
ఢిల్లీశు నెదిరి చెండిన తెల్గువిలుకాండ్రు
  నవలక్ష లోరుఁగల్ గవియునాఁడు

---

* పెమ్మసాని తిమ్మానాయని చెల్లెలు

రాచూరుకదనమం దేచి తళ్తళ మంచుఁ
తెలుఁగుజోదుల కత్తి తిరుగునాఁడు
అలచోళపాండ్యసీమలఁ దెల్గుసరకార్ల
పనుపు సూయాణమై ప్రాఁకునాఁడు
చూచి సంతోషభారంబు మోచి శిరము
నూఁచు భాగ్యంబునకు నింత నోఁచలేక
యేలపుట్టితి నిపు డిసీ! యేటిబ్రతుకు
కటకటా దాఁటిపోయె బంగారుయుగము

మంటికుండయు నల్కమంచం బెఱుంగక
చందవోల్పురము పెంపొందునాఁడు
కొల్లకొల్లగ మోటుపల్లిరేవునఁ బిసా
ళించుకస్తూరిని దించునాఁడు
రతనాలముత్యాల రాసులుపోసి రా
యలరాచవీటిలో నమ్మునాఁడు
మంచుందెరల నీనడించుసెల్లాలు బం
దరుముకాణములందు మెఱయునాఁడు
అందచందమ్ములకు దీప్తులైన తెలుఁగు
సతులు పన్నీటికలయంపి చల్లునాఁడు
నీ విలాసంబు నిండినరీవి గాంచి
పొంగలేనైతి నక్కటా పురుటిగడ్డ!

చెలువమ్ము నెగఁజిమ్ము జిలుఁగు తెల్గుఁలతోడఁ
బెన్నగట్టునఁ గృతుల్ పెరుఁగునాఁడు
మందారమకరందమాధుర్యధుర్యమై
యోరుఁగంటఁ గవిత్వ మూరునాఁడు
ధాటీసమాటీకనాటోపమునఁ గొండ
వీటిలోఁ గావ్యముల్ వెడలునాఁడు
క్రొంగ్రొత్తరుచులపొంగులఁ దుంగభద్రతో
వియ్యమై కబ్బముల్ వెలయునాఁడు
ప్రతిపదమ్మున రసచమత్కృతులు వెల్లి
- వోడువఁ దంజాపురింగైత నడచునాఁడు
తల్లి! నీభువనైకసౌందర్యరేఖ
కాంచనైతిఁ గదా! కంటికఱవు దీఱ.

ఖండించెనా ఘోరఖడ్గధార నితండు
మగధ సేనావ్యూహ మండలంబు
నడిపించెనా తెల్గునాఁటి శిల్పము మోయు
నౌక లీతఁడు రోము నగరమునకు
శ్రమియించెనా యితం డమరావతీ కళా
పరిషత్తులో శాస్త్రపారములకు
అర్పించెనా పద్యహారావళి నితండు
కనకాభిషేకంబు గన్నకవికి

త్రాగెనా రామభక్తిమైఁ త్యాగరాజు
క్రమ్మరించిన గీతామృతమ్ము నితఁడు
పూర్వసంస్కారదూరుఁడై పుట్టుకతన
వేఁడుచున్నాఁడు వివరింపవే! సవిత్రి!

## ప్ర బో ధ ము

దీపితవిక్రమాఢ్యము నదీనదశైలసముద్రకానన
ద్వీపవిశిష్టవిశ్వజగతీవలయప్రభుతాసమంచిత
శ్రీపదనిష్ఠమై కడుఁ బ్రసిద్ధివహించిన తెల్గుజాతికిన్
దాపరమైన యీ కసటుదైన్యము వాపఁగలేరె సోదరుల్

అచ్చెరు వయ్యెఁబో యిరువదాఱుశరత్తులనాఁడె రాష్ట్రమున్
దెచ్చెద మన్న తెల్గులకుఁ దీరవ కోర్కులు; మొన్నమొన్న కన్
విచ్చినయాంధ్రసైంధవులవేడ్కలు పూచి ఫలించె, నెన్నఁడో
వచ్చినవీనులన్ నిరుడువచ్చినకొమ్మలు వెక్కిరించెడిన్

తత్త్వ మెఱుంగలేక బహుధా శ్రమలన్ గుడుసంగనేల యాం
ధ్రత్వము లేనినాఁడు కలదా మన కించుకయేని భారతీ
యత్వము? తెల్గువీరుఁ డొకఁడైనను గాంగ్రెసుగద్దెనెక్క నే
తృత్వముసూపుభాగ్యమున కేటికినోఁచకపోయెఁ జెప్పుఁడీ!

కల ధనమెల్ల నొడ్డినను గాంగ్రెస్సుకై పడరానిబాధలన్
వలచిన బందె కోర్చిన లవంబును జంకక నెత్తురోడ్చినన్
దెలుఁగులత్యాగ మెల్ల వితథీకృతమైనది యింటిలోపలన్
గెలువనినాఁడు రచ్చలను గెల్చుట యెట్లుపొసంగుఁ జెల్వుఁడీ!

"ఆలస్యాదమృతం విష" మ్మనెడుపల్కాలించి మేలెంచి ని
ర్వేలోత్సాహము పెంచి సంశయతమోవిచ్ఛిత్తి గావించి దీ
ప్తాలక్ష్మీవశులై పురాంధ్ర జగతీ సంపత్తి నార్జించి సు
శ్రీలాలిత్యము నిచ్చి తల్లిఋణముం జెల్లింపుఁడీ సోదరుల్!

తల్లివిపత్తుగాంచి పరితాపమునంబడి రాష్ట్రబీజముల్
చల్లిన జొన్నవిత్తులకులప్రభవున్ గురునాథు నెంచుఁడీ
చల్లనివేళ; నాతని కొసంగిన పిండముఁ గాకి ముట్టుకో
నొల్లదు, పేరుచెందిన సహోదరులిట్టి కొఱంతలుంతురే?

మన్నించెనా యొక్కమాటేని పానుగల్
  విభుఁడు రంభయొసంగు వీడియమ్ము
గురుఁ డెంతగా వేఁడుకొన్నను గోష్ఠికై
  తలయూఁపె నొక్కొ వేదము బుధుండు
విసముకాదా సుధారసధార మోచర్ల
  రామచంద్రుడన కాంధ్రరాష్ట్రరవికి
కారెంపదే నందనారామసుమబంధు
  వనిలంబు నెమిలిపట్టాభిరాము

గాంగవాఃకణ మంగారకణముగాఁగఁ
జీకునం బడఁడో నరసింహశర్మ
తల్లి సంకెలలోఁ దల్లడిల్లుచుండ
నాకమైనను నరకంబుగాకయున్నె

(వీరు ఆంధ్రసభల కధ్యక్షులయి కీర్తిశేషులయినారు)

తెలుఁగుల మేలుకొల్పెనుపదేశమొసర్చెను రాష్ట్రమంత్ర మాం
ధ్రులవిభవమ్ము గోరి పలుదుఃఖములన్ సహియించె నమ్మహో
జ్జ్వలచరితుండు కొండవులసాగరచంద్రుని ప్రాణవాయువుల్
వెడలకమున్నె మా తెలుఁగువీరులు తెత్తురుగాక రాష్ట్రముక్

మూలమునందు లేనివిధముగ్ గొనియాడి స్వదేశగౌరవో
న్మీలితచిత్తులై తెలుఁగునేలను గొండల భారతమ్మునన్
జాలఁగ మెచ్చునాంధ్రకవిసత్తము నన్నయదేశభక్తి ని
ర్వేల మనారతంబుగ నరించుత నేఁటి తెలుంగుబిడ్డలన్

ఒక్కనిమేషమున్ నిలువ నొడ్డలకై వస నైనగడ్డలో
గ్రుక్కెఁడుగంగ ముట్ట నొకకొంచెము గాలియుఁబీల్వనన్నయా
చిక్కని తెల్గుజోదు గుణసింధువు *వేంకటరామమూర్తి పెం
పెక్కినమాతృభక్తి భజియింతురుగాక! తెలుంగుసోదరుల్

ఎవ్వండాతఁడు మింటనిల్చి మనపై నీ నందనోద్యానపుం
బువ్వుల్ చల్లెడి? నాంధ్రరత్నముసుఁడీ! పుణ్యాత్మ! నీవప్పుడే
దవ్వైపోయితివా? త్రిలింగజననీ దాస్యంబు దూలింపఁగా
నువ్విళ్ళూరెడి మా కొసంగవె జయవ్యూధంబు లాశీస్సులన్

---

* గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు

దీక్షాకంకణమున్ ధరించి జనయిత్రీదాస్యవిచ్ఛేదనా
పేక్షల్ పొంపిరివోవ ముజ్జగము కంపింపంగ లేలెండు మీ
దక్షత్వంబున కడ్డులేదు చరితార్థత్వంబు మీకబ్బె నే
పక్షుల్ గూసిన నేమిలెక్క కడిమిన్ బాలింపుఁడీ సోదరుల్

నారాష్ట్రంబు గడించితీరెదను నానావిఘ్నముల్ వచ్చినన్
రారాపిల్లకుఁ దల్లడిల్ల నను తీవ్రజ్వాలతోఁ గార్యమున్
బ్రారంభించిన తెల్గుబిడ్డ నెదిరింపన్ బ్రహ్మరుద్రాదులే
చేరంజాలరు తక్కుఁ బ్రముక్కులశై చింతింపఁగా నేటికిన్

ఒడ్డెలఁ గొండవీటికడ నోర్చినలగ్నమునందు రాయచూర్
గడ్డను బాదుసాలను గకావికసేయు ముహూర్తమందు మీ
రొడ్డినశౌర్యమున్ దలఁచి "హు"మ్మనిదూఁకుఁడు రంగమందు మీ
కడ్డమువచ్చి నిల్వఁ దగినట్టిమగన్న జగాన లేఁ డిఁకన్

ఒకనాఁ డంధ్ర ధరావిరోధి నరపాలోదగ్రసేనా శిరః
ప్రకరంబుల్ విదళించి తద్రుధిర ధారానిర్ఝరస్నాతులై
కకుబంతంబుల మీర లెత్తిన పతాకన్ నేఁడు చిత్తంబులో
నొకమారెంచుఁడు రక్తమగ్నిసఖమై యుప్పొంగి ఘూర్ణిల్లఁగన్

నాయకులం దనేకులు వినాయకులైరి సమస్తవిఘ్న సం
ధాయకు లైరి స్వార్థపరతంత్రుల వారలఁ జెప్ప నేల తే
జోయుతు లైన మా తెలుఁగుజోదులు దీనికి నోహటిల్ల నే
లా యొకఁడొక్కఁడే జగము నంకెకుఁ దార్చఁగదా క్షణంబునన్

అతిరథులేకదా! తెలుఁగు లందఱు నెక్కటి విక్రమమ్ముచే
క్షితితల మెల్ల నోర్వఁగల చేవ తెలుంగులసొమ్ము పో! జగ
ద్ధిత కరణీయముల్ నెఱపి యెల్లరు నెల్లరమించి లోక వి
శ్రుత యశముఁ గడించుటకె మాతురు పాతు రధర్మపద్ధతుల్

వాడినతల్లి నెవ్వగలు వాపఁగ నీవుపుగంటివారికిఁ
గోడలు మాలతీకుసుమకోమల వేంకటరత్నమాంబ క్రొ
వ్వేఁడి తెలుంగు నెత్తు రతివేలజవం బిడ నెండవానలం
దోడక పెక్కుపాట్లు పడుచున్నది కంటిరె తెల్గుసోదరుల్!

పొలివోవలేదు తెల్గులపరాక్రమరేఖ
మన 'టంగుటూరి'లో మల్లడించె
సడలలే దాంధ్రవిజ్ఞానతేజఃపుంజ
మది రామలింగార్యు నాశ్రయించె
చెదరిపోలే దాంధ్ర శేముషీసంపత్తి
పట్టాభిసచివు కేల్ పట్టుకొనియె
బీఱువోలే దాంధ్రవీరదాతృత్వంబు
నాగేశ్వరునిలోఁ బెనంగియుండె

తఱిఁగిపోలేదు తెల్గు కైతల పసందు
కులుకుచున్నది చెళపిళ్ళ కలమునందు
నిస్పృహాహేతు వించు కేనియును లేదు
సోదరా! లెమ్ము నీ హక్కు లాడుకొమ్ము

తమిళకర్ణాటబంధము లూడ్చి తెల్గునీ
మను స్వతంత్రమ్ముగా మార్చువఱకు
రాష్ట్రనిర్మాణకార్యము నివార్య మటంచు
మప్పువారికి బుద్ధి సెప్పువఱకు
ఒడ్డెమాగాణమం దోదిఁగి పేర్వాసిన
తెలుఁగుఖండము నెల్లఁ దెచ్చువఱకు
బళ్ళారిలో నాంధ్రభాగ మంతయుఁ జీల్చి
తెలుఁగురాజ్యమ్ములోఁ గలుపువఱకు
నిదియు నది యని లెక్కింప నేల యాన
దాంధ్రవిషయమ్ము నొక్క రాజ్యమ్ముఁ జేసి
పట్టి జయభేరిపై దెబ్బగొట్టువఱకుఁ
దెలుఁగుపసిపాపకైన నిద్రింపఁ దగునె ?

## సంస్కరణము

లోప మదేమి తెల్గు లతిలోకమనీషు లుదారతా సము
ద్దీపితు లంచితార్థసముదీర్ణు లహో! భువనత్రయంబు నో
క్షూఁపునలేపువారు మహిమోజ్జ్వలులేయటులయ్యు నామమున్
రూపము లేక యుంటకు నెఱుంగుఁ డసూయలు కారణంబుగన్

వైదికు లన్నచో మొగమువాచ్చు నొకండు నియోగిభోగముల్
ఖేదముగూర్చు నొక్కనికి గిట్టదు గిట్టదు కమ్మవారిభా
గ్యోదయ మెల్లవారలకు నోర్వఁడు రెడ్డియశం బొకండు స
మ్మోదము నీదు కాఁపుల సమున్నతి యొక్కని కేమిపాపమో!

ఈ సూత్రము పఠించియేకదా! "ఆంధ్రర
త్నము" నలయించి ప్రాణంబు గొనుట
ఈ మార్గమును ద్రొక్కియేకదా! మన "ధర్మ
రాయని" కాదరం బీయకుంట
ఈ ధర్మమును మెచ్చియేకదా! "పట్టాభి"
పట్టాభిషేకంబు పాడుసేఁత
ఈ మంత్రము జపించియేకదా! "టంగుటూ
రి"కి నామమాత్రమంత్రిత్వమిడుట

మాయురే! మాయఁగా రాని మచ్చయగుచు
వెన్నుదన్నుచునుండె నీ "వెధవ" గుణము
చుట్టుప్రక్కల దేశాల సోదరులకు
లేఁతయైపోయె మన తెల్గుజాతిబ్రతుకు

కులములమాట కేమి యొకగోత్రమునన్ జనియించి యొక్కచో
నిలిచెడివార లొక్కయెడనే మసి యయ్యెడివార లీర్ష్యచే
మలమల మాడుచుందు రతిమాత్రము; దుర్భరమైన దోష;మీ
తెలుఁగుకులజన్మ మిట్లె కడతేఱునొ తీఱునొ కాఱుఁజీఁకటుల్

వచ్చెను బుద్ధివచ్చె నికవద్దిఁక వద్దిటువంటి జీవితం
బెచ్చట నార్జవంబు కల దెచ్చట శౌర్యము తాండవించు నిం.
కెచ్చటఁ బ్రజ్ఞ వెల్గు మఱియెచ్చట నొప్పు నుదారతాగుణం
బెచ్చట నచ్చుగొట్టక జోహారులు వెట్టుఁడు తెల్గుసోదరుల్ !

## పశ్చిమాంధ్రులు

రాణ దొలంగెఁబో తమిళరాష్ట్రమునం దొకకొంతయొడ్రబోమా
గాణమునందుఁ గొంత తెలఁగాణమునం దొకకొంత మధ్యమా
గాణములందుఁ గొంత కలగాపులగం బయి తెల్గునేల, యిప్పా
జేనేఁడుముక్కలో సగము చీల్తురఁటే మనపశ్చిమాంధ్రజుల్

మీమేన త్తసుతుండె రాయ లకటా మిథ్యావివాదంబు లే
లా మాకాతఁడుకూర్చు బంధువుఁడుగాఁడా మిమ్మునున్ మమ్మునున్
దా మన్నించినమాట నిక్కువము గాదా మీ పొలంబొక్కటే
యే మీ రాయలసీమయానె కనుఁగొండీ పశ్చిమాంధ్రప్రజల్

కటకం బాదిగ సింహళంబువఱ కేకచ్ఛత్రమై సత్కవి
స్ఫుటవాణీపరిగీతమై పరనృపభ్రూభంగసంపాదియై
పటుకీర్తిం గనినట్టిరాజ్యముఁ గదా పాలించె రాయండు మీ
నటనల్ గన్గొని పల్లటిల్లి యతఁ డన్నా సిగ్గునన్ మ్రగ్గఁడే

నాటలేదా కొండవీటి ఖిల్లామీఁద
శత్రుభీకర మైన జయపతాక
ఆంధ్రవిష్ణుపదంబు లర్చించి కాకుళ
క్షేత్రమం దాముక్త సెప్పలేదె
గోదావరీ నిర్మలోదక స్నాతుఁడై
కోనసీమను మెచ్చుకొనఁగలేదె
సింహాద్రి నరసింహు చెంత నుత్తాలమౌ
దిగ్జయ స్తంభ మెత్తింపలేదె
అకట పూర్వాంధ్రమున రాయ లాక్రమించి
యాదరింపనిగడ్డ కాసంత కలదె
ఇదియు రాయలసీమ గా కేమియగునొ
వెల్లడింపుఁడు కృతబుద్ధు లెల్లఁ గూడి

మేముఁ మీవలె నాంధ్రశౌర్యమునకుఁ మేలెంచి విద్యాపురీ
సామ్రాజ్యస్ఫురణంబు గోరి పరరాజ్యశ్రీల నార్జింపఁగన్
మా మేనంగల రక్తమెల్ల బలిదానం బీయలేదా మనీ
షామాధుర్యము సూపి మంత్రిపదవుల్ సాగింపమో చెప్పుఁడీ

సాయపనేనివారు పెమసాని మహీశులు రావెళాన్వయుల్
రాయలసేనలన్ గదనరంగములన్ నడిపింపరో జగ
ద్గేయపరాక్రమంబు నొలికించి జయేందిర కేలు పట్టరో
యేమెడవారొ వారు వచియింపుఁడు పూర్వచరిత్రవేత్తలై

మీకున్ మాకును లేవు భేదములు దుర్మేధావు లాంధ్రేతరుల్
మాకున్ మీకును దంపిపెట్టి బ్రదుకన్ మల్లాడుచున్నారు మీ
రా కుక్షింభరులన్ ద్యజించి యుచితవ్యాపారపారీణులై
లోకుల్ తెల్గుల నుగ్గడించువిధ మాలోచింపుఁడీ మ్రొక్కెదన్

మాకున్ మీకును లేవు భేదములు మామాటల్ యథార్థంబులే
కాకున్నన్ దనవారిఁ దాఁ జనక రంగద్భంగహస్తాళితో
మాకృష్ణమ్మను గౌఁగిలించుకొనునే మన్నించునే తుంగభ
ద్రాకూలంకష మీ సరస్వతి నితాంతస్నేహసంపన్నయై

తలఁ దాల్పలేదె విద్వత్సార్వభౌముని
గట్టమంచికులాబ్ధికైరవాప్తు
మన్నింపలేదె రామారాయణింగారి
సాచివ్యమును సుప్రశంస లిచ్చి
ఆడలేదా కృష్ణమాచార్యకృతములై
నీటుగుల్కెడు పెక్కునాటకములు
సకలవేదాంతవేత్త కోనంగలేదె రా
ధాకృష్ణునకు జయధ్వానములను
ప్రతిభగలవారి మీ వారి సత్కరించి
త్రోసిపైచిరె యెపుడేని తూర్పువారు
సందియము లేల రెండు బుజాలు గలిపి
చేయవలె నాంధ్రరాజ్యలక్ష్మీవ్రతంబు.

నెత్తురుసిండి కయ్యాలను నీరముఁజేసి జగమ్ముఁబెంచు కాఁ
పెత్తనడంగఁజూచి మదినెంతయుఁ గుంది తదీయసేవలో
విత్తముపండు మంత్రిపదవిన్ దృణముంబలె వీడినట్టి లో
కోత్తరశీలు మెచ్చుకొనమో మునిస్వామిని యస్మదీయులన్

మమునిరసింతురా బిరుసుమాటలు పల్కెదరా తెలుంగు లీ
క్రమమునఁ జెన్న రాష్ట్రమున ద్రావిడకన్నడసేవఁ జేయు టి
ష్టమ యగునొక్కొ మీకు నకటా యొక నెత్తురు పంచుకొన్నవా
రము మన మన్నమాట వినరా కనరా స్వపురాచరిత్రముల్

మాకష్టంబులలోన సౌఖ్యములలో మా కీడులో మేలులో
మీ కర్పింతుము పాలు రిత్తభయముల్ మీకేల మీయాఁకటిన్
బోకార్పం దగుదారి లేనియెడ మాపొట్టల్ విదారింతు మ
జ్జ్రాఁకల్ పెట్టక తల్లి కూడిగము సేయం బూనుఁడీ సోదరుల్

ఏమో చేసిరి తీరవాసు లని మీ రెగ్గాడుచున్నారు మీ
సామర్థ్యంబునకున్ గళంక మిడువాంఛల్ సూపుచున్నారు మీ
సేమంబుల్ దిగఁ ద్రొక్కి స్వార్థమున కిస్సీ స్వాగతం బిచ్చు దు
ష్కామముల్ వారలుకారు కార్కొటకటా శాంతించుతన్ బాపముల్

ఎల్లరు నాంధ్రదేశమున కియ్యది కేంద్రమటంచు సర్వసం
పల్లతికాలవాల మన భాసిలు సహ్యాసుతా తటంబునన్
జల్లఁగ నిల్పినట్టిపరిషత్తు విశాఖకు నెట్టి మిమ్ము మ
మ్మల్లరిపాలు చేసిన మహామహు లెవ్వరో మీ రెఱుంగుఁడీ

"ఇంతింతై రిపు లింతయై మఱియుఁ దా మింతై నభో వీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రున కంతయై ధృవునిపై నంతై"న కాలాన నీ
యంతర్యుద్ధ మరిష్టనాయకము గాదా జాతికి న్నీతికిన్

అయ్యంగార్లకుఁ జెట్టియార్లకును నాయర్ కోటికిన్ బిళ్ళ కా
యయ్యర్ మీనన మూకకున్ మొదలియార్లన్ వారికిన్ దాసుఁడై
డయ్యం గారణమేమి యాంధ్రుఁడు? బలిష్ఠంబైన వేదండ మ
య్యయ్యో యాదోమలనాశ్రయించుకొని జోహార్లిచ్చె నీనాఁటికిన్

అకలంకం బగు నాంధ్రసంస్కృతికి నేఁ డాధారమే లేదు వి
శ్వకళాశాలకు వర్ణనీయగరిమల్ సౌందర్యముల్ గానరా
వకటా చేరెఁడు మంచినీళ్ళకు నుపాయం బున్నదా పంచకో
లకపాయంబున జీవితంబునకు నేలా చిక్కు మాధుర్యముల్

తిరుచనాపలి తంజవురులందు రేడియో
పెట్టిన మన కేమి యుట్టిపడును
పైకరా మెట్టూరు ప్రాజెక్టులను లెస్స
కట్టిన మన కేమి పొట్టనిండు
అయ్యర్లు మొదలియార్లధికారములు చలా
యించినంతనె మన కేమి యొరగు
ద్రావిడభాషానిఘంటువు సిద్ధమైనచో
బావురే మన కేమిపండు గగును

అణ్ణామల విశ్వవిద్యాలయమ్ము మిపులఁ
బుష్టి నందిన మన కేమిప్రోగువడును
చెప్పుకోన నేల యిన్నిరో సిగ్గుచేటు
సైఁపలే మింక నుమ్మడికాఁపురంబు

సచివులై సచివాగ్రసరులై త్రిలింగంబు
పాలించు భాగ్యంబు పడయుకొఱకు
తుంగభద్రకు సేతువుం గట్టి ముక్కారు
పండు కేదారముల్ పడయుకొఱకు
ఊరూర శారదాగారముల్ నెలకొల్పి
పాండితీసంపదల్ పడయుకొఱకు
వన్నె వాసి దొఱంగి చిన్నవోయినయట్టి
ప్రతిభావికాసముల్ పడయుకొఱకు

ఇదియు నది యని ప్రేలెత్తనేల మీఱకు
వలయుసౌకర్యముల నెల్లఁ బడయుకొఱకుఁ
దెలుఁగుతల్లికి వెలుఁగులు తెచ్చుకొఱకు
నడుముగట్టుఁడు రాష్ట్రంబు వడయుకొఱకు

అపరాధంబులు లేవు మా వలన నేయావంత కాన్పించినన్
గృపతో సైఁపుఁ డుదారతానిధులు గారే శౌర్యసంపన్నఖం
డపరీతం బగు తెల్గునేల నొకజెండా క్రిందికిం దెచ్చి ధీ
నిపుణామ్రేడితకీర్తి కాశ్రయములై నిల్వుండు వీరోత్తముల్

* * *

ఆదోనిన్ గుమిగూడి మీరు పదుగుం బ్రౌచిత్యదూరంబులౌ
వాదంబుల్ పచరించి మున్నిడిన మా వాగ్దానముల్ నమ్మఁగా
రాదంచున్ నిరసించి మీకొక పృథగ్రాష్ట్రంబు వాంఛింతురే
నాఁడా చిత్తము నివ్విధిన్ గలఁతురే న్యాయంబు వర్జింతురే

ప్రళయోత్థానిలచండవేగమునఁ బై పై దూఁకు నాంధ్రోద్యమ
జ్వాలనజ్వాలల కోహటిల్లినరిపుల్ సంధించి రీ వ్యూహముల్
తులువ ల్పన్నిన మిత్రభేదమున కంధుల్వోలె మీ రగ్గమై
తలవంపుల్ ఘటియించు కార్యముల కుత్సాహంబు వాటింతురే?

తెల్లనివెల్లఁ బాలని మదిం దలపోయుటఁ జేసి మీకడన్
జెల్లెను వారి గారడపుఁజేష్టలయో మన కాపురంబులో
నల్లరిసాగి శాత్రవుల హస్తము రేఁగెను; గాని లోకమం
దిల్లలుకంగనే ముగియునెట్టులు? పందు వదెట్టివారికిన్

ఎంతవిచిత్రవార్త! మనమెల్లరమున్ విదళింపలేని మీ
చింతలు మీరు మమ్మువిడ చీలిననాఁడు తొలంగ నేర్చునే?
చెంతకువచ్చులక్ష్మిఁగని సీ! యని వాకిలి మూయఁబోకుఁ డీ
గంతులు సూచి విజ్ఞులు ఫకాఫకనవ్వఁదొడంగి రక్కటా!

ఆదాయం బొక రెండుకోట్లకును రాదయ్యెంగదా మీకు నా
పై దేశంబునఁ గాటకంబు లెపుడున్ బ్రత్యక్షమే; రాష్ట్రమే
యాధారంబున నిర్వహింపఁగలరయ్యా! మానుఁ డీ దుర్భ్రమల్
తాఁదూఱం దగు కంత లేనియెడ నేలా డోలు కంఠమ్మునన్?

పదికోట్లైన ధనంబుకావలెఁగదా భద్రానదింగట్ట? మీ
కది యెన్నేని శతాబ్దులేఁగిన నలభ్యంబేకదా? లేమికిన్
ముదగన్పింపని బక్కకాఁపురమునన్ దోఁగాడు మీకెవ్వరున్
బదిరూకల్ ఋణమే నొసంగరుగదా? పంతంబు లిట్లేటికిన్

జాతీయప్రథకై మహాంధ్రజగతీ సమ్మేళనన్ గోరి శం
కాతంకంబులు లేక మీకయి మహాత్యాగంబుగావింప సం
ప్రీతింజూపిన మమ్ము వంచకులఁగాఁ బేర్కొంటి రన్నన్న! మీ
పాతుల్ త్రివ్విన దెన్నఁడో తెలిపి మాపాపంబులన్ జాటుఁడీ

తమిళులు మీకు సర్వసుఖదాత లుదారులు; కేరళ ప్రజల్
మిముఁదలఁదాల్చికొల్చెదరు; మిత్రులకై వడిఁ గన్నడుల్ వికా
సము గలిగింత్రుమీకు; నిఁక శాత్రవు లాంధ్రులు తీరవాసులా?
శ్రమలకునోర్చి యేఁగరుని సన్నిధి నేర్చితి రవివేకముల్

అక్కట! నాతనూజులిటు లాఁబడిపోక నెఱుంగలేక దు
ర్వాక్కలహంబుపెంచి రనవద్యుల సోదరులన్ ద్యజింపఁగా
మక్కువసూపి రెంతపెడమార్గము పట్టిరటంచు బాష్పపుం
జుక్కలు "చుంయి చుంయి"మనుచుంబడ నేడ్చెడితల్లిఁగంటిరే

నిక్కములేనివాదము లనేకములన్ బచరించి మమ్ములన్
రక్కసులంచు మీర లనరాని దురుక్తుల నెంతతిట్టినన్
వెక్కసపాటుఁజూప మవివేకుల కై వడి దుర్యశంబులోఁ
జిక్కము యుష్మదీయమగు చెల్మిని దక్కము తక్కమెన్నఁడున్

అచ్చముగఁ దల్లికడుపునఁ
జిచ్చున్ దరికొల్పునట్టి చేఁతలు వల, దే
పొచ్చెంబులేదు మాదెస;
నుచ్చాటన సేయుఁడీ దురూహమ్ములకున్

కలదు ముహూర్తమొం డచిరకాలమునందె "నిరర్థక క్రియల్
సలిపితి మాగ్రహింపకుఁడు సైరణసూపుఁడు తేనెప్రాఁతక
త్తుల కలరూపెఱుంగక యధోగతిగంటి" మటంచుఁ గొంకు స్రోఁ
బలుకుచు మీరు మాచెలిమిఁ బాయక తల్లి సపర్య సేయఁగన్

## మాతృభాష

ఊరక రాష్ట్రమూడిపడునొక్కొ? మహేశ్వరినట్లు మాతృభా
షారమణిన్ భజించుటకు సంబరమందని చచ్చుజాతికిన్
సారతరప్రభావులు నజయ్యులునై మన వంగసోదరుల్
తారల పోల్పునన్ మెఱయుదానికి నేమికతంబు సెప్పఁడీ!

లేజవరాలిమోవికి జిలేబికి బాలరసాల మార్దవ
శ్రీజనయిత్రికిన్ రుచులుచిందెడు తేనెకు నాంధ్రవాణికిన్
రోజునఁ దెల్గుబిడ్డలె విరోధులఁటే తెలవానిబాసపై
మోజఁట వారి కిట్టివిధమున్ గని యెట్లుసహింతు నక్కటా!

కమ్మని తెల్గటంచు నుడికారము సొంపుల నీ విశాల వి
శ్వమ్మున దీనిఁ బోలిన వచస్సు నభస్సున మంచు వేయి వా
క్యమ్ముల నేను మెచ్చుటయ కాదు రసజ్ఞు లుదారు లెల్ల ఖం
డమ్ముల మెచ్చి రిచ్చిరి వినమ్రితమైఁ గపురంపుటారతుల్

ఇద్దరు తెల్గువాండ్రు తమయింటివి కష్టసుఖాలు చెప్పఁగో
నద్దిర మాతృభాష తగదా మఱి యింకొక పెద్దరోగమే
కద్దు వచింతు నాంగ్లము మొగంబు నెఱుంగని శ్రోత్రియుండు దు
ర్బుద్ధులు కూయుచుంద్రు పలుపోకల నెంగిలిపీసుకూఁతలన్

ఇంటన్ దగ్గెడువగ్గుతాతలకడన్ హీరింగు టూరింగులే
వంటం జేసెడినాయనమ్మలకడన్ వార్నింగు టర్నింగులే
యంటుల్తో మెదుకుంటికుంకలకడన్ హంటింగు ప్రింటింగులే
గెంటింపం దగునంటురోగమిది సిగ్గే తల్లి! పల్కాఁడగన్

పసగలజవ్వనంబు పరభాషలకున్ బలియిచ్చి మాంసమున్
వసయు నశించి రక్తము లవంబును లేక చరచ్ఛవంబులై
పసి చెడినట్టి తెల్గు లోకచందము నందము లేనిపొత్తముల్
పుసపుస గీసి దుర్యశము పూసిరి కమ్మని తల్లిబాసకున్

ఎన్నఁడుఁ దల్లిబాస వచియింపనివారికి నందుఁ గబ్బముల్
పన్నెద మన్నచో ముదుగుపల్కులుగాక మరొండు తోఁచునా
నన్నయతిక్కనాది కవినాథుల పోఁడుము లంతుపట్టునా
చిన్నయసూరిలక్షణ మిసీ యనిపింపక సొంపు నింపునా ?

♦ ♦ ♦

ఈకథ యిట్టు లుండఁగనె హిందియు దూఁకెను గోరుచుట్టుపై
రోఁకటిపోటువోలె; నితరుల్ వెనుకాడిరి గాని తెల్గువాఁ
డాఁకొనియున్న పేద మధురామృతముం బలె దీనికి న్నమో
వాకము లిచ్చి మెచ్చె ననవద్యవు హృద్యవు నీవ పొ మ్మనెన్

వల దీబాస యటంచు నే నుడివి దుర్వాదంబు గావింప; ని
ప్పలుకే భారతజాతికెల్ల నొకసంబంధంబు సంధింపగాఁ
గల; దీచుట్టటికంబు లేకయ కదా గాసిల్లెడిన్ దాస్యశృం
ఖల కగ్గంపడి భారతావని తిరస్కారాలవాలంబుగన్

పోతన్న కలము సొంపుల నెఱుంగకమున్నె
తులసిదాసునికై తఱోఁ బనేమి
బొబ్బిలి కథలోనిదెబ్బ చూడకమున్నె
మేవాడపతనంబు మెచ్చనేల
రాజశేఖర చరిత్రము పఠింపకమున్నె
రంగభూమికి జయారావ మేల
*పూదండ సౌరభంబులను బీల్వకమున్నె
సప్తసరోజకై శ్రమమదేల

కోర్కెమై నొక్క భారతిం గొనకమున్నె
కాన్క లేటికి మాధురీకరుణకొఱకు
పైత్య మెసరేఁగి కంటికి భ్రమలుగమ్మి
దిక్కు తెలియక యున్నాఁడు తెలుఁగువాఁడు

* శ్రీపాదవారి కథల సంపుటి

పునరావృత్తినిన ర్తకం బగు పదంబు న్గోరి ఘోరవ్రతుల్
మునిరాజుల్ పరమేశునట్లు నిరతమ్ముగ్ దీని సేవింపఁగాఁ
జనునే తెల్గుల కింతనెట్టి తగునే సామాన్యసంభాషణల్
పౌనరింసం దగునట్లు తే పదిపదంబుల్ నేర్చినన్ జాలదే!

పరరాజ్యంబుల నాక్రమించి కడిమిన్ బాలించి యచ్చోటనే
తిరమైపోయిరి కోటిమంది తెలుఁగుల్ దేశాలు పెక్కింటిలో
మఱువంజొచ్చిరి నేఁడు తల్లినుడు లీ మార్పాటు లజ్జాకరం
బరరే! పైనముగట్టుఁ డందు రమణీయాంధ్రత్వము న్నాటఁగన్

మొన్ననె వింటిఁ; బాండ్యమున ముప్పదిలక్షల తెల్గువాంద్రకున్
గన్నులు లేవటే! తెలుఁగుకబ్బము సూచుట; కింతనీచపుం
బన్నము నోర్తురా? తెలుఁగుప ల్కఁబనంబున వ్రాసికొందురా!
మిన్నులు పడ్డ దేశములు మెట్టిరపో! పరు లిట్లొనర్తురా?

ఢిల్లీలో పట నున్న శీతనగపీఠిన్ టోకియోవీధిలో
నిల్లుం గట్టిన రాజు వెట్టు మహిలో హిట్లర్ కడన్ గాలమున్
వెళ్ళఁబుచ్చిన నూర్ధ్వలోకముల కే వేంచేసినన్ దెల్గువాఁ
డుల్లంఘింపఁగ రాదు తల్లిపలు కెట్లో రక్షసేయందగున్

నీతీరుతీయముల్ నిగ్గుజగ్గులు సూచి
బ్రౌను బ్రహ్మరథంబు పట్టె నీకు
నీఠవి నీహొయల్ నీబెడంగులు మెచ్చి
యిబ్రహీం కానుక లిచ్చె నీకు

నీసొంపు నీపెంపు నీ యొయ్యార మెఱింగి
 శాహాజీ పరిచర్య సలిపె నీకు
నీతేట నీపాట నీనీటు దిలకించి
 యఱవ లెల్లరు దాసు లైరి నీకు

ముజ్జగంబుల నినుఁ బోలు ముద్దుగుమ్మ
రసికతావేత్తలకుఁ గానరాదు రాదు
ఏ పురాపుణ్యలేశమో యిటకుఁ దెచ్చి
యర్చకుని జేసె నీకు నన్నాంధ్రవాణి!

## తెనుఁగుఁదనము

మానక రాష్ట్రసిద్ధి కతిమాత్రము నాత్రము వెల్లడించు నీ
మానితదేశభక్తి బహుమార్గములన్ నుతిసేయఁ దగ్గదే
కాని మఱొక్కమాట; శతకష్టము లోర్చిన నీప్సితంబు గై
కో నగునొక్కొ నీకుఁ దెనుఁగుందనమున్ భజియింప కుండినన్

ఆర్యావర్తమునుండి కశ్చన యొకం డాంధ్రావనిం జేరుచోఁ
దూర్యధ్వానము భోరుకొల్పెదవు గంతులై వ్వచె దాహ్వానముల్
మర్యాదల్ పచరింతు; వాంధ్రున కసామాన్య ప్రథాశేముషీ
ధుర్యగ్రామణి కంటఁగట్టెదవు దుర్దోషంబు లీర్ష్యాళువై

నాఁడు విహారులోఁ బ్రళయ నాట్యము రేఁగి చరాచరంబు ల
ల్లాడఁగ వేలువే లొసఁగి యా త్రిశరణ్యుఁడ వైతి మంచిదే !
నేఁడు తెలుంగులో సగము నేలకు నాలుక లెండి సోదరుల్
మాఁడుచు వేఁడుచుండ నొకమాడయు జార్పవి దేమి తమ్ముడా !

అష్టైశ్వర్యములు నీకు నాంధ్రపత్రిక లెల్ల
నింటివేల్పులు టైమ్సు, హిందు, మెయిలు
నలసారములుగదా తెలుఁగుమందులు నీకు
జండుఫార్మసి సుధాసాగరంబు
కలకుబండలు భద్రగిరి, తిర్మలలు నీకుఁ
బండరిక్షేత్రంబు పరమపదము
పరిహాస్యములు నీకు * బాలమ్మచరితముల్
శరణంబు కుసుమాంబచరణపీఠి

చఘృతి చంద్రుఁడు తెలుఁగుపుస్తకము నీకు
విదియ జాబిల్లి హిందీకవిప్రబంధ
మక్కటా ! యేలపుట్టె నీకుక్కమూతి
పిందియలు నీకు నంచితాస్పందమతికి

దామెర్లవారి చిత్తరువుసొంపులు చూడ
♦ వవనీంద్రగీఁతల కబ్రపడెదు
కోడిరామునిశక్తి గొనియాడ నొల్లవు
గామాను దలఁదాల్చి గారవింతు

* మంగళగిరి బాలాంబ. ♦ అవనీంద్రనాథ ఠాకూరు.

కన్నాంబనటి నేర్పు గని సెబా సనలేవు
దేవికాఫిల్ముకై తీవ్రపడెదు
నాగభూషణు గీతనై పుణ్యా మెఱుఁగవు
త్యైగరాచార్యపాటను గణింతు

వెల్లకాలము పొరుగింటిపుల్లఁగూర
కొఱకు లొట్టలు వేయు దుర్గుణమె నీకు
నిష్టదైవత మయ్యె నీకష్టబుద్ధి
యెట్లు రుచియించె దీని నీ కెఱుఁగు మప్పె

చాళుక్యరాజ్య ప్రశస్తి నీ వెఱుఁగవు
నార్మన్ ప్రభుత్వవర్ణన మొనర్తు
రుద్రమాదేవి పౌరుషభంగుల నెఱుంగ
వెలిజబెత్తు మహత్త్వ మెన్నుచుందు
సూరన్న కావ్యకళారూఢి నెఱుఁగవు
షేక్స్పియర్ కవికి జేజేల నిడుదు
మన తిమ్మరుసుబుద్ధిమత్త నీ వెఱుఁగవు
వాల్పోలుచరితంబు వల్లెవైతు

నిన్ను నీ వెఱుంగ కెన్ని విధానంబు
లాశ్రయించి సర్వదా శ్రమించి
యెట్టిబన్నములకు నియ్యకో లూనిన
లేదు లేదు ముక్తి లేదు నీకు

నీ పుట్టిన గడ్డఁ బయిన్
శ్రీపదములు మాతృరూప చిహ్నితరేఖల్
దీపించెడి ప్రత్యణువున్
నీపాలిటివేల్పుగా గణించుట వలయున్

ఆంధ్రుఁడవై జన్మించితి
వాంధ్రుఁడవై యనుభవింపు మాయువ్విభవం
బాంధ్రుఁడవై మరణింపుము;
ఆంధ్రత్వములేని బ్రదుకు నాసింపకుమా



అయ్యరుగూడకట్టు మన కక్కఱయే గుజరాతుటోపితో
నెయ్యములేనిచో బ్రదుకనేర మరబ్బుల లుంగిపొత్తులే
దయ్యెనయేని చక్కఁదన మన్నది సున్న తెలుంగువాని కీ
దయ్యపువేస మేల మనతాతల తండ్రుల కట్టు గిట్టదే

కు స్త్రీపట్లకు నీటుపోటులకు నుక్కుంగత్తిచెర్లాటకున్
వస్త్రాదుల్గద తెల్గువారు రిపుగర్వం బూడ్చ నెల్లప్పుడున్
ముస్తాబేకద వారిశౌర్యరమకున్ మోహంబు పుట్టించు వాల్
పుస్త్రీలన్ గొఱిగింప సాగి రకటా బుద్ధుల్ విజృంభించెడిన్

తుకతుక పుట్టెడున్ గొదమతుమ్మెదఱెక్కలవోలె నాస్యల
క్ష్మికి నొకవింతకాంతినిడు మీసములన్ గొఱిగించి త్రెంచివో
లికయుఁట ముక్కుక్రిందనొక లేశమునిల్పెద రద్ది యెద్దియో
మకిలవలెన్ జుగుప్సనిడి మానసమున్ గలఁగించివైచెడిన్

శ్రోత్రియులెవ్వరో విడువఁజూచినఁ జూతురుగాక నిస్తుల
క్షాత్రశరణ్యులై సమదశత్రుభయంకరులై జగత్త్రియీ
స్తోత్రములందినట్టి పురుషుల్ కనిపెంచిన కోడెగాంగ్రకున్
జిత్రముగాదె పౌరుషముచిప్పిలు మీసములేక యుండినన్

మీసములేనిమూతి కవిమిశ్రమనోహర కావ్యవాఙ్మయా
భ్యాసములేనిపల్కు నవపల్లవకోమల కన్యకా పద
న్యాసములేని కొంప లలనామధురాధర సంపుటీసుధా
గ్రాసములేని జీవితముగాదె గుణగ్రహణైకదృష్టికిన్

హరిసర్వోత్తమరావు కొల్లిపరసూరాభిఖ్యుఁడున్ దేశసౌ
ర్యరమానాథులు కోటిరెడ్డియును మారంగయ్యనాయండు నె
వ్వరికో పుట్టినబుద్ధి మెచ్చి కళ కావాసంబులౌ మీసముల్
గొఱుఁగన్ బూనకయుందురుగాక యని మ్రొక్కుల్ వేయి దేవళ్ళకున్

కొంకిరివేసముల్ వలచి కోఁతుల వైరి తెలుంగుబిడ్డ లే
వంకకుఁ బోయినన్ దెలుఁగువాఁడిత డంచుఁ దలంచునట్లుగా
వంకరలేనివేసము నవశ్యము తాల్చకయున్న నెవ్వరీ
సంకరు లంచు లోకు లెకసక్కె మొనర్తురు లేఁతమాటలన్

వేసమెటున్న నేమి? పరవిద్యలకున్ బరజాతిరీతికిన్
దాసులమైన నేమి? పరతంత్రత పోకకు దీని కేమి సా
వాస ? మటంచు ఱంకెలిడువారికిఁ జీఁకికి రాని పిచ్చి వ

నోఁచినతల్లి కెందఱు తనూజులు కావలె నైజవేషభా
షాచరితమ్ములందుఁ దనజాతిమతమ్ములయందు దేశసే
వాచరణమ్మునందు బుధులందు మహాకవులందు వీరులం
దేచిన పేర్మి గల్గి చరియించు గుణాఢ్యుఁ డొకండు సాలఁడే

## ప్ర మా ద ము

విచ్చెన్ విచ్చెఁ దమస్సు నీసుతులకున్ వేండ్రమ్ము తీండ్రించె ని
న్నుచ్చైస్థానమునందు నిల్పుటకు వా రుంకించు చున్నా రిదే
నచ్చెన్ మంగళవేళ దైన్యభరమున్ వర్జించి సంతోష సం
పచ్చైతన్యమునన్ దలిర్పు మిఁక నంబా ! పుత్రు లుప్పొంగఁగన్

ఆశాస్యం బగు విక్రమమ్ము వరణీయత్యాగమున్ శేముషీ
కౌశల్యమ్మును సందడింపఁగ భవత్కల్యాణ సంపాదనా
వేశంబూనిన సాంబమూర్తికి జగద్విఖ్యాత కీర్తిప్రదం
బాశీర్వాద మనుగ్రహింపఁ గదవమ్మా ! యాంధ్ర వీరప్రసూ !

అతఁ డేమో నిను విస్మరించె నని రోషావిష్టు లై మొన్న నీ
సుతు లెల్లన్ నిరసించి రట్టి సడికిన్ జో టిచ్చునే లోక వి
శ్రుతశీలుం డగు బుల్సు పండితుఁడు? వచ్చుం గాక దుర్దాంత దు
ర్గతి పుంజమ్ములు, కూలికిం గుడుతురే కాకోలమున్ నీప్రజల్?

అటుసుతుఁ బూడ్చిపెట్టి నిటులందుకొనెన్ భరతోర్విశృంఖలా
పటల విపాటనక్రియలు; బాపురె! దండశతక్షతాంగుఁడై
జొటజొట నెత్తురోడినను శూరతఁ బాయఁడు సాంబమూర్తి నీ
కెటు లతఁ డెగ్గుసేయు జననీ? వినఁజాలనివాదు లేర్పడెన్

## సాంత్వనము

ఒక "యంత్రబ్రహ్మ" తెలుంగురాష్ట్రమున కేదో "కుంభకోణంబు" సేఁ
తకునై మొగ్గర మొడ్డినాఁ డని మహోదగ్రక్రుధావిభ్రమద్
భ్రుకుటిం జూపఁగ నేల గ్రుడ్లురిమి గంతు ల్వేట్టఁగా నేల శౌ
ర్యకళాభిజ్ఞుల కేల పిచ్చుకపయిన్ బ్రహ్మాస్త్రసంధానముల్

ఎవఁడో మీ సిరి కడ్డువచ్చు టది వింతే! యాంధ్రజాతీయతా
పవనం బేలిన ఋత్విజుం డని ప్రశంసం గన్న సోదర్యుఁడే
యవినీతిన్ దలఁ దాల్చి కానులకు నాహా! దాసుఁడై "తెల్గువా
రవివేకుల్ జగదేకనీచు"లని కూయన్ వ్రాయ సిద్ధంపడన్

మన దేవయ్యమఱొక్కరుండు "తెనుఁగేమాటాడరా" దంచు శా
సనముంజేసె నిఁకొక్క భైరవుఁడు లజ్జాత్యాగ పారీణుఁడై
"తెనుఁగుంజాతికి రాష్ట్రమేటి"కని ధిగ్ధిగ్రావముల్ పల్కెఁ బ
చ్చనికూటంబున; నెచ్చటం గలరు దేశద్రోహులేతాదృశుల్?

శకము న్నిల్పిన జాతి, మాతృజగతీసమ్మాననసంపత్తికై
సకలం బిచ్చిన జాతి, కీర్తిలహరీస్నానప్రియుల్ మూఁడు కో
ట్లకుమారు ల్గలజాతి, వీరిఁ గని కంట న్నిప్పులన్ నీరముల్
ప్రకటింపం బని యేమి కేవల తృణప్రాయు ల్గదా తాదృశుల్

చింతలవ్రంతలన్ జివికి చేడ్పడు తల్లిసపర్యసేఁతకై
పంతము లాడు మీకథలు బంగరుబంతులతోఁ జరిత్రలో
వింతపహారంగు దాల్చు శుభవేళ కడున్ దఱియంగ వచ్చె వి
శ్రాంతికిఁ దావు లేదు కృషి సల్పుఁడు శాంతి నహించి సోదరుల్!

## అఱవగోడు

కలుములతల్లికిన్ దెలుఁగుగడ్డకు రాచఱికంబు వచ్చినన్
దెలుఁగులవిత్తముల్ గుడిచి త్రేఁచెడిభాగ్య మడంగునంచు వి
హ్వలులయి వెఱ్ఱులెత్తి యఱవల్ గఱువల్ నిరసించుధర్మముల్
సలికిరి పాలలోఁ బడిన బల్లుల కై వడిఁ దల్లడిల్లుచున్

చెన్నపురం బహో! తెలుఁగుసీమకు రాదఁట, వేంకటేశ్వరుం
డన్నివిధంబులన్ దమిళుఁడట్టె, యొకప్పుడు చోళరాజు లోఁ
గొన్నకతాన సింహపురి కూడను ద్రావిడ మంట, యెట్టెటో
పెన్నకు నీవలన్ విడిచిపెట్టిరి చేరెఁడు తెల్గువారికిన్

రాజకులావతంస మపరాజితశౌర్యకళావిభాసి మా
రాజనరేంద్రభూవరపురాకృతపుణ్యఫలంబు కంచిలో
రాజులు మెచ్చఁగాఁ దమిళరాజ్యము నేలఁగలేదె? చోళులే
రాజులుగారు పాండ్యులె పరాక్రమశీలురుగారు కాలన్

అల్లరిమూఁకలై తిరుగునప్పుడు మిమ్ముల దిద్దితీర్చి మీ
పల్లెలు పాఁడిపంటలకుఁ బాదులఁ జేసి కళారహస్యముల్
తెల్లమొనర్చు హర్మ్యములు దేవళముల్ తమకిచ్చి రెవ్వ రా
పల్లవు లాంధ్రజాతినరపాలురయా! కనుఁగొందు ద్రావిడుల్!

నడిసన్నచీరంబు చాటి మిమ్మేలిన
విశ్వనాథుఁడు తెల్గువిభుఁడుగాఁడె
కనుసన్న మీయూడిగమ్ము లందిన చెవ్వ
ధరణీశుఁ డాంధ్రసోదరుఁడుగాఁడె
కన్నసంతానంబుగతి మిమ్ము సాకిన
యచ్యుతుఁడాంధ్రనాయకుఁడు గాఁడె
పాలించి మీకు సభ్యతరుచుల్ గఱపిన
రఘునాథుఁడు తెలుంగురాజుగాఁడె

తమిళ సోదరులార! వాదంబు లుడిగి
మధుర తంజాపురాదులు మా కొసంగి
సింహపురమును మీరలే చేకొనుండు
నిగ్రహింపుము మీధర్మనిర్ణయంబు

ఎంచఁగ దిర్వతిలోన నూటికి నొకండేలేఁడు మీవాఁడు పో
షించెఁగ రాయలు భూరిభోగములఁ బత్ క్షేత్రంబు నద్దానిలోఁ
బంచారించెను జాంద్రమాన; మదిమాభాగంబురా కేమగుఁగ?
వంచంబోకుఁడు శీర్షముల్ పిడుగులఁగ వంచింతురే తెల్గులఁగ

అందనిద్రాక్షపండ్లకొఱ కజ్జులు చాఁపకుఁ డింద్రజాలముల్
వందలువేలుసూపి పెడవాదముసల్పినఁ గోవిదుల్ సెబా
సందురటయ్య! చెన్నపుర మాంధ్రులసొత్తని యుగ్గడింపఁగఁగ
గ్రిందుగఁ జేటలోని వెలఁగ ల్వలె నున్నవి మేటిసాక్ష్యముల్

ఏ పురమ్మున కాజ్ఞ యిచ్చి రాంధ్రభూమా
పాలకుల్ శతశతాబ్దములకొలఁది
ఏ పురమ్మున కాఖ్యయై పొల్చు దామెర్ల
వెలమవీరుని చెన్నవిభునిపేరు
ఏ పురీపాలనవ్యాపారసభ నందె
నగ్రతాంబూలంబు నంధ్రభాష
ఏ పురాభ్యుదయమ్ముకై పంచిపెట్టె మా
గతిమ్మనాయంకు మందిర సహస్ర

౧ బేరీ తిమ్మప్ప.

మే పురమ్మున కలరు ౧జెంటూపురాఖ్య
యే పురం బడి ౨మదరాసునై పొనర్చు
నా పురం బాంధ్రలక్ష్మికిం గాఁపురమ్ము
కాదుకా దంట మతిలేని కడుపుమంట

ఎఱుఁగుదురా? తెలుఁగుం బ్రజ
గరిమకు నది లాంఛనంబుగాఁ బెండిలిలోఁ
దురగంబునెక్కి యఱవలు
పురమేఁగుట మున్ను చెన్నపురమున లేమిన్

మఱచితిరె? మా దురాయికి
వెఱచి వివాహోత్సవంపు వేళల మీరల్
సరిగుంజలతోఁ బందిరి
విరచించుట మానుకొన్న వృత్తాంతంబున్

బల్లలమీఁద మా తెలుఁగుబాలుర నుంచియు నేలమీఁద మీ
పిల్లల నిల్పి మున్ను చదివించెడివారఁట యొజ్జ లిప్పుడిన్
జెల్లరె! మేనయత్తకును జిక్కనిమానము వచ్చి నేఁటి కీ
వల్లడిపుట్టె గ్రుడ్డెగిరివచ్చెను బిడ్డను వెక్కిరింపఁగన్

---

౧ పోర్చుగీసువారు తెలుఁగువారిని "జెంటూస్" అనియు వారి పట్టణమును "జెంటూటౌస్" అనియు పిలిచిరి, ౨. ఇపుడు కోటయున్న చోటికి "చెన్నపట్టణ" మనియు దానికి నుత్తరముగానున్న (ఎస్ప్లనేడ్) చోటికి "మాదరాజుపట్టణ" మనియు పేర్లు. మాదరాజొక తెలుఁగు నాయకుఁడు, "మాదరాజుపట్టణ" మను పదమే రానురాను "మద్రాసు" ఐనది.

పొరపొచ్చెంబులు లేనివాఁడగుట మీ పోకిళ్ళు గుర్తింప లే
కఱనం బాడిన తెల్గువాని జనసంఖ్యంగూర్చు కాలాన మీ
రఱవన్ జేసినమాట నిక్కువముగాదా? చెల్లునే యింత ద
బ్బఱ? పంచాంగము పోయినంతనె నశింపంబోవు నక్షత్రముల్

ఆంధ్రకేసరి స్పైము నదరిపోవఁ దుపాకి
కెదురుగా నిలిచి ఱొమ్మిచ్చునాఁడు
నీలువిగ్రహము నిర్మూలించుకోఱకు నాం
ధ్రులు కుఠారంబులు నూఱునాఁడు
రంగయ్యనాయఁడారంభించి శాసన
ధిక్కారశరము సంధించునాఁడు
దుర్గ చందాన మా దుర్గమ్మ చెలరేఁగి
శాంతిసంగ్రామంబు జరుపునాఁడు

చెన్నపురిఁ జిన్నపాపలై యున్నవారె
యొడలెఱుంగని నిద్రలో నడఁగినారె
దున్నఁబోవ దూడలలోనఁ దూఱువారు
మేయఁబోవంగ నెడ్లలో మెలఁగఁదగునె

ఎందుంజెల్లని పొల్లువాదములు మీ రెన్నాళ్ళు సాగించినన్
మందపజ్ఞులుగారు తెల్గులు భయోన్మాద క్రియామగ్నులై
"తందానా"యని మిమ్ము మెచ్చరుసుఁడీ! తాటాకుచప్పుళ్ల కున్
గుందేళుల్ వెఱఁగందునే పఱచునే కుంచించునే వాలముల్

అనుకూలించె నుపశ్రుతుల్ జయజయధ్వ్యాహారసంపన్నముల్
వినిపించెన్ సుర లిచ్చుదీవనలు మా విక్రాంతి నిర్వక్ర మౌ
తెనుఁగుంజోదుల నేఁడు మార్గాన మహాదేవుండె శంకించు మా
మనముల్ నొచ్చెడు సేఁత లేల? రథముల్ మళ్ళింపుఁడీ ద్రావిడుల్

మా శిల్పంబులు శాస్త్రముల్ కవితలున్ మర్యాదలున్ శేముషీ
వై శారద్యము లన్యదుర్లభయశస్స్వాంతంబులై యుంటకున్
దేశంబున్ విభజింపఁగా వలసె నంతేకాని మీరందఱున్
మా శ్రీలన్ దినుచుంటఁగా; దది చిఛీ! మా కేమి లెక్కా? జమా?

*మా విమలార్కుఁ డాతనికుమారుఁడు రాజనరేంద్రుఁ డద్ధరి
త్రీవిభునందనుండు తమ తియ్యము వియ్యము నందిరాంధ్రులున్
ద్రావిడు లాత్మబంధులుకదా పరికింపుఁడు కాదు కాదనం
బోవదు నేఁటికిన్ వెగటుపుట్టెనె మీకుఁ దెలుంగునెయ్యముల్

వేఱెమి లేదు లేదు మము వేఱుగఁ జూడకుఁ డచ్చమైన మీ
కూరిమి పేరిమిం బడయఁగోరిన తమ్ముల మేము; మిమ్మునన్
దూఱిన మాకు నిడ్డెనలు దోసెలు, కాఫియు నుల్లిగడ్డ సాం
బారు నొసంగి యింకెవరు పండువు సేయఁగనేర్తు రక్కటా!

తరుణులమోవి తేనియలు త్రావకపోయిన నేమి స్వర్గపుం
బరిచితిఁ గూర్చు సోమరసపానము సేయకయున్న నేమి మా
కరుణగభస్తిబింబ ముదయాచల మెక్కకమున్నె వెచ్చనై
గరగరమైన కాఫి యొక కప్పిదిగో నని యయ్యరిచ్చినన్

*విమలాదిత్యుని భార్య కుందవాంబయు రాజరాజుభార్య అమ్మంగదేవియు కులోత్తుంగుని భార్య మధురాంతకదేవియు అఱవల (చోళరాజుల) ఆఁడుపడుచులు.

## ఆ హ్వా న ము

పగవారై భవదీయ మభ్యుదయముం భంగించు నీర్ష్యాళువుల్
జగమందుం గలరంచు నోడకుము నీ సంతాన ధీసత్త్వముల్
తెగువల్ గణ్యములై యెఱుంగవె నినుం దేజోనిధిం జేసి నీ
సిగపూ వాడఁగనీ రికన్ సుతులు సంసేవింతు రాంధ్రప్రసూ!

పొరపడి కొన్నినాళ్ళు పెడబుద్ధులు మెచ్చిరి నీమహాత్త్వమున్
మఱచిరి భక్తిమై సవతిమాతను గొల్చిరి వచ్చె నిచ్చె మా
వరము లటంచు మూఁపు లెగవైచిరి నేఁటికి మొట్టికాయలే
దొరకుట జేసి నీకడ సుతుల్ తలవంచిరి తప్పు సైఁపవే!

చేసేతనంది తెచ్చిరి నైష్ఠికులు పావ
నాంధ్రవేణీతీర్థ మలసి సొలసి
నెఱవేడ్క ముగ్గి కట్టిరి చిన్ని బాలకుల్
తూర్యధ్వనులలోనఁ దోరణములు
అర్ఘ్యంబు పాద్యంబు నర్పింప భక్తిమై
సిద్ధమైయున్నారు వృద్ధజనులు
కాకలీధ్వనుల మంగళగీతికలు పాడ
నాయత్తమయ్యెఁ గన్యాజనంబు
వేదబుక్కుల నిన్ను సేవించుకొనుటకు
శ్రోత్రియులు నిల్చినారు పవిత్రమతులు
ఆంధ్రజననయిత్రి! మా పూజ లందుకొనఁగఁ
గదలిరావమ్మ సుముహూర్తకాల మయ్యె

చల్లపల్లివిభుండు కల్హారిసుబారివు
సీపల్లకి బుజాన మోపి నడువ
న్యాపతిసుబ్బరాయఁడు వేంకటప్పయ్య
వింజామరంబులు విసరుచుండఁ

గోన బుద్ధారెడ్డి రంగయాఖ్యులు తెలుగుశౌర్యంబుఁ
దలఁపించు వీరగీతములుపాడ
రామలింగారెడ్డి రమణీయమహాకీర్తి
చ్ఛత్రంబు పట్టె నీ సరస నిలువ
సాంబమూర్తి గళం బెత్తి స్వస్తి పలుక
భోగరాణ్మంత్రి పెత్తనంబును వహింప
నెల్లమాగానులందు నూరేఁగవమ్మ
యఖిలవైభవసముపేత! యాంధ్రమాత!

## పట్టాభికి జై

పట్టుఁబగ్గము లేనిచందమున సప్తద్వీప మహా భూమికిన్
బట్టాదారుల మే మటంచు నఱవల్ ప్రత్యర్థులై జాతికిన్
రట్టుల్ దెచ్చుతఱిన్ ద్రివిక్రముఁడ వై అంపిల్లి మాఱొడ్డి తో
పట్టాభీ! జయలక్ష్మి తావకభుజాబంధంబు మన్నించుతన్

పరుషంబౌ సిన జీవితం బీఁక సహింపంజాల మంతంతకున్
బరువౌచున్నవి తల్లికష్టము లనల్పస్థైర్యరేఖాసము
ద్ధురతేజంబున వార్ధులింకిన గిరిస్తోమంబు లుబ్బూఁగినన్
బరమేశుం డదలించినన్ నిలుప క్రీవస్థానసంరంభముల్

రక్కసతాల్మి నోర్చితిమి రాష్ట్రముఁలేని పరాభవంబు నల్
దిక్కుల ధిక్కృతిధ్వని ప్రతిధ్వనిసేయఁ దొడంగె ముజ్జగం
బొక్కట వేఁడుకొన్న మొగమోటకు నియ్యది వేళగాదు నీ
యుక్కు వెలార్చి యాంధ్రవిజయోత్సవదాతవుగమ్ము సోదరా!

ఎవఁడేమూాలుగు మూర్గినన్ దెలుఁగునాఁడీనాఁడు సోత్సాహమై
భవదాజ్ఞావశవర్తియై యశము సంపాదింప నుంకించెడిన్
అవిగో పింజలు పింజలై విరిసె నీర్ష్యా మేఘపుంజంబు లి
య్యవిగో నీకు ననర్ఘరత్న కుసుమ వ్యాకోశముల్ దోసిళుల్

రథోత్సవము

అదిగో తెల్గులతల్లిదివ్యరథ ముద్యత్కాంతిపుంజంబులన్
బదిదిక్కుల్ వెలిఁగించుచున్ గదలెడిన్ బ్రస్థాన భేరీధ్వనిన్
బధిరంబయ్యె జగంబు మీఁకుఁ గలకాన్కల్ తల్లికర్పించి తద్
రథమున్లాగుఁడు మాతృభక్తి దయివాఱన్ దెల్గువీరాగ్రణుల్

ఆరథనేమిఘట్టనల కగ్గములై మన హేయకాయముల్
తీఱినఁదీఱుఁగాక! చను దెండు విచారము లేల ? మాతృసే
వారమణీయవృత్తమున నందురి సచ్చినవారి జాహ్నవీ
తీరమునందు భోగములఁ దేల్తురు వెన్నెల గేల నచ్చరల్

చల్లుం బుజ్జ్వలశౌర్యవీర్యములతో సామ్రాజ్యనిర్మాతలై
యొల్లన్ దేశము తెలునాఁడు మనయం దేగర్వసంరంభ ము
ద్వల్లీలల్ నటియించె నిప్పుడు తదీయాటోపముల్ గోరుచుల్
మల్లెల్ మొల్లలు జాజు లాంధ్రజగదంబాపాదపీఠమ్మునల్

ఆశీస్సు

ఆచక్రవాళంబు నాంధ్రజాతీయతా
మధురసౌరభ్యముల్ మలయుఁ గాత
బిగువెక్కి నేలనాలుగు చెఱంగులయందుఁ
దెలుఁగురాచటికంబు వెలయుఁ గాత

లక్ష్మీ సరస్వతీలలనా నివాసమై
　　యాంధ్రదేశమ్ము పేరందుఁ గాత
విశ్వమోహనకళావీథియై తెల్గుల
　　శిల్పవిన్యాసంబు చెలఁగుఁ గాత
రసికలోకమ్మునకు విందు లొసఁగి పొసఁగి
వేశికవితాలతాంగి వర్ధిల్లుఁ గాత
తెనుఁగుజనయిత్రి పచ్చతోరణముతోడ
నిత్యకల్యాణరాశియై నెగడుఁ గాత!

ఆ కాం క్ష

ఎట్టి ఘోరదీక్షలు సహించితినో తొలుబామునందు నీ
కెట్టిదళంబు లెట్టివిరు లిచ్చి సపర్య లొనర్చినాఁడనో
పుట్టితి నీ సుతుండనయి పోఁడిమి గంటిని దల్లి! పీనికిన్
బెట్టుముభిక్ష నీ యనుఁగుబిడ్డఁడుగా నెప్పుడున్ జనింపఁగన్
నీ రమణీయమూర్తి కమనీయవచస్స్ఫురణం బుదారతా
గౌరవ మద్వితీయ రసికత్వ విభూతి విశిష్టశౌర్య వి
ద్యారుచిరత్వ మెంతకొనియాడిన మత్కవితాపిపాస చ
ల్లారదదేమొ తల్లి! యిది యాఱని మారని యిల్లె నిల్చుతన్
నాకేకాదు భవచ్చరిత్రము లనన్యప్రాప్యధారారస
శ్రీకందమ్మన నందగించుకవితన్ జిత్రించు భాగ్యంబు ను
ద్రేకస్ఫూర్తియు నస్మదీయములగు పుత్రీపుత్రకశ్రేణి కీ
వాకల్పాంత మనుగ్రహింపఁగదవమ్మా! యాంధ్రవీరప్రసూ!